స్వాంతములేమిఁ బ్రేలుదురు ♦ గాక మహాకవి శేమిలోటు ల
జ్ఞారహితుల్ స్వశక్తిపర ♦ శక్తు లెఱుంగక పొంగు టబ్రమే. 12.

వ. అని శిష్టాచారంబు నిర్వర్తించి కృతినాయకవంశావతరణపూర్వకంబుగాఁ గృత్య
వతారంబుఁ బ్రశంసించెదము. 13.

మ. గల దార్వేలనియోగిశాఖ యొకఁ డ♦క్కంజాతభూవర్ణమం
దలఘుత్వంబునఁ బొల్చు నయ్యెడ సమా♦త్యశ్రేణు లుద్యోగులుం
దెలుఁగుంబాసకవీంద్రులు మ్మఱియు నెం♦దేనిం ధరాపాలురుం
గల రానాఁడును నేఁడును న్మిగుల యో♦గం బిందుఁ గానంబడున్. 14.

గీ. కల్మిఁ దనరారు నీశాఖఁ♦గాశ్యపముని,గోత్రమునయందుఁ గొచ్చర్ల♦కోటవంశ
మలరు విద్దెయు నసమును♦గలిమి బలిమి, సాజములు దీనఁ గలసత్య♦సంధులకును.

గీ. ఎందఱో పుణ్యపూరుషు ♦ లిక్కులమ్మునందు జనియించి ప్రఖ్యాతి♦నంది రందు
మిగులసత్కీర్తి గని కవు♦ ల్మేటి యనఁగ, నలరె శ్రీరామచంద్రుఁడ♦య్యనఘుఁబోలి.

గీ. వియ్యనయుఁ బెద్దిరాజు జ♦గ్గయ్య రామ,రావు నాఁగ జనించి రా♦రామచంద్ర
మూర్తి కాత్మజు లిందఱుఁ♦గీర్తిధనులు, దాతృతాశూరు లధికార♦ధన్యతములు. 17.

శా. అందుం జగ్గయగారి నెన్నఁ దరమే ♦ యప్పుణ్యుఁడే శ్రీమహా
నందీశుండు వసించు పట్టసగిరిన్ ♦ నవ్యస్థితిం గట్టఁజే
సెం దివ్యచ్ఛివకేశవాలయము లా♦శ్రీ చూచి తీఱన్వలెం
బొందుం బున్నెముఁ బూరుషార్థ మటకుం♦బోనెంచు పుణ్యాత్ములన్. 18.

సీ. మొదటినుండియుఁ దుట్ట♦తుదదాఁక నేరాజ్యమునకన్న గోదావరి♦ మొనసియుండుఁ
బ్రజలపాపము పంచ♦బంగాళముగ వీర,భద్రేశుఁ డేసీమఁ ♦ బ్రబలియుండుఁ
గొండకాల్వలవాలు ♦ నిండించు పెంజెర్వు, లేమండలము ఫలి♦యింపఁజేయు
రత్నాకరాఖ్యభూ♦రమణి కెచ్చటఁ బ్రతి[illegible]దమున సార్థక♦త్వము వహించు

గీ. నెందుఁ ద్రిదశులకంటికి♦విందుఁ జేయు, విలువగల్గినపాపికొం♦డలు చెలంగు
నట్టిమండల మార్జించె ♦ ననఘమూర్తి, మహితగుణశాలి జగ్గయా♦మాత్యమాళి. 19.

గీ. అతని కుదయించెఁ గేవల♦మనఘమూర్తి, ధీరుఁడు నుదారుఁ డబ్ధిగం♦భీరుఁడలఘుఁ
డాత్మవిద్యావిశారదుఁ ♦ డతని పేరు, రామచంద్రవేంకటకృష్ణ♦రావటంద్రు. 20.

గీ. భద్రకాళీపదద్వయీ♦భక్తి కవన,శక్తి శివసక్తి తన కివి ♦ సహజములుగ
నయ్యనఘునాత్మజుండు మ♦హాయశస్సు,నాథుఁ డై యొప్పె శ్రీజగ♦న్నాథరావు.

మ. అవనిం గౌతమియొడ్డున న్మిగుల భాగ్యాయత్త మౌ రెడ్డిపా
లవరగ్రామము రాజధానిగఁ జిరాలంకార మైవచ్చు రా
జ్యవిశేషమ్మును నేలె నీయనఘుఁడు ద్యత్ప్రాభవం బొప్ప శీ
లవయశ్శాలిని కామమాంబ సుగుణాలంకార దేవేరిఁగన్. 22

ఉ. చక్కనిచుక్క యయ్యు సమిసంబును దాఁ దనభర్త ప్రక్కఁగా
ద్రొక్కక రాత్రులం బయలు ద్రొక్క నరుంధతి యంచు నామె నుం
గ్రక్కన ప్రేలఁ జూపుదురు గాని మహాసతి కామమాంబకు
న్నిక్కము కోస మంచును గణింపరు గాఁ బలుగాకు లేనియున్. 23

సీ. దైవభక్తి విద్యాసక్తి జనరక్తి, యను నివి సహజమ్ము లైనవాఁడు
ఆపాదుకాంతదీక్షాపార మైనన్యాలవవేదమున సిద్ధుఁ డైనవాఁడు
ప్రజలకష్టము కంటఁబడెనేని మితిలేని, కరుణ చిత్తమునందుఁ గలుగువాఁడు
తనవారు పెఱవార లనుభేద మఱయక, తగురీతి జగ మేలఁదగినవాఁడు
గీ. నయవిదుం డగు నాజగన్నాథమూర్తి, కొలఁది కాలములోన లోకులయదృష్ట
వైపరీత్యంబునన వీరభద్రు భద్ర, కాళి సేవించి తత్పదైక్యంబు గనియె. 24

సీ. ఎంతమందికి నేని నింగ్లీషు చెప్పించి, పెండ్లిండ్లు చేయించెఁ బ్రియము మెలరఁ
బట్టిసక్షేత్రస్థపర్వతసోపాన, ములు బాగుచేయించి ముదముగొలిపెఁ
గోటిపల్లెను నెల్ల బాటసారుల కుప, యోగించు సత్రంబు నొకటి పెట్టె
నన్ని యిన్ని యనంగ నలవిగాని గతి నెన్నఁ జెర్వులను నూతు లెలమినిం
గీ. లక్షవర్తివ్రతం బాది[illegible]సుకృత, కార్యము లొనర్చె లోకోపకారబుద్ధి
నాజగన్నాథమూర్తి కర్థాంగి యైన, కామమాంబిక నెన్నఁ గవులు గలరె. 25

చ. ప్రతిశివరాత్రికాలమునఁ బట్టనమం దనఘాత్ము లైనవి
ప్రతతుల కెల్ల మొల్లముగ భక్ష[illegible]ము లెల్లెడ నొప్పఁ గొల్లగా
మితికి నతిక్రమించుగతి మేదిని యాజ్యము చేత నామన
ట్లతితరభక్తి భక్త మిడు నయ్యమ పుణ్యము నెన్న శక్యమే. 26

చ. ప్రతిదినమాత్మగేహమున బ్రాహ్మణు లెందఱికేని షడ్రస
ప్లుతముగ నన్నదానమును బొంపిరివో నొనరించుచే మహా
వ్రత మని యెంచి తాన ప్రతిపత్తికి వచ్చు నటంచు విందు మా
నరి కొకయన్నపూర్ణ యగు సాటి యొరు ల్పృతి నాఁగఁ జెల్లునే. 27

సీ. గౌతమగోత్రవి♦ఖ్యాతు శ్రీపెద్దాడ,వంశజుఁ బెద్దవి♦ద్వాంసుఁ డై ది
గంతవిశ్రాంతమా♦గతి శ్రీశకుంతలా,పరిణయ మనెడి ప్ర♦బంధ మెలమిఁ
జేసిననాగరా♦ట్ఛేఖరుముస్మను,మని మల్లికార్జును♦మనుమని ఘనుఁ
దనచెల్లె లగుతిర్ప♦తమ్మకు నకలంక,కనఘుఁ డౌనాగరా♦జాఖ్యునకుఁ ద

గీ. నూజు విద్యలభోజు మ♦నోజతేజుఁ,గలితకవిరాజు యాచక♦కల్పభూజు
రామచంద్రవేంకటకృష్ణ♦రాడ్బిడౌజు, దత్తుగాఁ గొనెఁ గామాంబ♦ధవునియాజ్ఞ.

శా. దత్తుం డయ్యును గన్నపుత్రువలె సా♦తం డామెయం దెక్కు డౌ
బత్తిం బేర్మియుఁ జూపుచు న్వశమునం ♦ బద్ధాదరుండై కళా
వత్తం బాల్యమునంద కైకొని సుధీ♦వర్యు ల్నుతింపన్ జన
ద్వృత్తాఢ్యుం డయి సత్కవిత్వగతి నెం♦తే వృద్ధిఁ జెందె న్వెసన్. 29.

చ. అతిసుకుమారుఁ డయ్యుఁ బ్రభు♦వయ్యు క్రమంబు గణింపఁ బోక చి
న్నతనమునుండి విద్యల మ♦నం బిడి వేగ బియే పరీక్ష నం
గతముగఁ దేఱి యిక్కతన ♦ గొప్పరు చేఁ గడుగౌరవంబు నొం
ది తనరు కృష్ణరాట్ప్రభు సు♦దీర్ఘయశంబు వశంబె యెన్నఁగన్. 30.

కం. జననీజనకులు మును చే,సినధర్మమ్ములను వృద్ధిఁ♦జెందించి తనం
తన కొన్ని ధర్మకార్యము, లనూనముగఁ జేసె నన్యు♦లాతని కెనయే. 31.

చ. మరుని జయించు రూపమున ♦ మాధవుఁ బోలుఁ గృపాప్రసక్తి సా
దరమున మేటి యోర్వన సు♦దారగుణంబున నేరు సాటి ధీ
వరులకుఁ గల్పవాటి పరి♦పాటి నెలర్చెడు కృష్ణరాయభూ
సురవిభుధాటి కెయ్యెడలఁ♦జూచిన మేల్ప్రతికోటి కల్గునే. 32.

కం. నిరతాన్నదానరక్తియు, సరసకవిత్వప్రసక్తి ♦ శాంతిగుణమహో
త్తరపూర్ణశక్తి సహజ,స్ఫురణమ్ములు కృష్ణరాయ♦భూమీంద్రునకున్. 33.

కం. ఇతఁ డతికవితాలోలుప,మతి యని వర్ణింపనేల ♦ మాటికి నీసం
గతి ప్రతిమాసమున సర,స్వతియే ప్రతిదేశ మేగి ♦ చాటుచు నుండన్. 34.

కం. ఇంతకు నెక్కుడువారలు,నింతకుఁ దక్కు డగువార♦లెందఱు లేరీ
ప్రాంతముల జమీందారులు, శాంతమ్మున నింతవారు♦ జనియింప రికన్. 35.

చ. కవి యనునంతమాత్రమునఁ గాదొకపద్యము నేని జక్కఁగా
నవరసభావముల్ సెలఁగ నాణెముగా రచియించి తన్నుఁ జూ
డవలయు నంచు వచ్చినయెడ న్మతి వాని దరిద్రతాభరం
బవలకుఁ ద్రోయఁజాలిన యుదారుఁడు వేంకటకృష్ణుఁ డల్పుఁడే! 36.

చ. ఎవరికి లేని నిచ్చుపని యే మనవృత్తి య టంచు నెంచి స
త్కవులను బండితోత్తముల గాయకులం దనియించుఁ గాని పో
లవరవిభుండు రక్షితకళావిదధీశుఁడు కృష్ణరావు మె
ప్పు వడయానంతపాటి బుధపుంగవులుం గలరే జగంబునన్. 37.

గీ. మేను బలి యను నాకర్ణమితిని దెల్పు,నయనయుగళమ్ము శ్రీకరాననము సెప్పు
నామభావము శ్రీకృష్ణరాయచంద్రుఁ,డితఁడు వితరణియని వచియింపవలెనె! 38.

ఉ. పాఱులయందు విద్యల నపారులు గల్గిరి గాని బల్లమీం
దారులు లేరు గల్గిన నుదారులు గా రటు లేని దుర్గభా
కారులు కాకపోరు కవికారుల కీ రిది యెల్ల మన్మథా
కారుని కృష్ణరాడ్విభుని గారణికాగ్రణి నాశ్రయించెఁగా. 39.

ఉ. శ్రీ రంజిల్లెడు వాడరేవుకులవార్ధిం బుట్టి శ్రీపాపమాం
బారావు స్సతిగాఁగఁ జేకొని జగన్మాన్యంబు గాఁగం జమీం
దారై యేలెడు వేంకటేశ్వరు నపత్యం బైన గారంపు బం
గారమ్మం గొనెఁ గృష్ణరాయధరణీకాంతుండు దేవేరిగన్. 40.

కం. బంగారమ్మ తనకుఁ దను,వుం గాఁ దగు కృష్ణరాడ్విభువరేణ్యునకున్
బంగారమ్మ యెలమి న,ర్ధాంగం బై యొప్పు టొక్కయబ్బుర మగునే. 41.

మ. ఘనుఁ డాతం డొకనాఁ డనూన మగువేడ్కం గొల్వు గూర్చుండి మ
మ్మును శ్రీమత్పరదేవతామహిమసంభూతాశుధారాకవి
త్వనితాంతప్రతిభావిశేషరచితాపారప్రబంధానుబం
ధనులన్ దివ్యశతావధానధనులం దర్కించి వల్కెం గృపన్. 42.

సీ. తగ నాత్మకూరుసీతారామభూపాలుఁ, డేన్గు నెక్కించి యూరేగఁ జేసె
గద్వాలరామభూకాంతుండు గౌరవ,స్థితి కై బంగారుబిరుదు లిచ్చె
నానందగజపతిక్ష్మానేతయును దగి,నకవీంద్రు లంచు మన్నన యొనర్చె
శ్రీరాజగోపాలకృష్ణయాచనృపాలుఁ, డవధాను లంచు గౌరవము చూపెఁ.

గీ. జెన్నపురి రాజ్యమందు వ•సించు రాజ,వరులు మిము గారవింపని వారు గలరె
జగ మెఱింగిన బ్రాహ్మణునకు•జందె మేల, నరసతిరుపతి వేంకటే•శకవులార! 43.

వ. అని బహూకరించి మీరచించిన ధాతురత్నాకర కాళీసహస్ర వీక్షిరూపకశుకరం
భాసంవాదాది సంస్కృతభాషాప్రబంధంబులును శ్రవణానందదేవీభాగవతశ్రీని
వాసవిలాసలక్షణాపరిణయైలామాహాత్మ్యాదు లగునాంధ్రప్రబంధంబులును ననే
కమ్ములు నసాధ్యతరమ్ములు నగు శతలేఖిన్యవధానాష్టావధానాది కవితావైచిత్ర్యం
బులును మీయశమ్మునకు సాక్ష్య మొసంగు నని మఱియు నిట్లనియె. 44.

గీ. ఇద్ధతేజుఁ డైన•బుద్ధదేవుచరిత్ర, మశ్వఘోషముఖుల • ననుసరించి
యస్మదంకితము గ•నాంధ్రకావ్య మొనర్పుఁడనుచు వీస్ర మిచ్చె•నాదరమున. 45.

క. ఇచ్చినఁ గైకొని మనమునఁ,బొచ్చెము గనరానికూర్మి•పొసఁగఁగ నెంతే
హెచ్చగు నంతసముం గని, సచ్చరితుం డితఁడు కృతికిఁ•జాలు నటంచున్. 46.

చ. అనువుగఁ గృష్ణరాయలు జ•యాంకుఁడు మున్నుల తుంగభద్రయొ
డ్డునఁ దనరాజ్య మేలుచుఁ గ•డుం గవిరాజుల నాదరించి యాం
దనపరిచారికాతనయ•తం దిగఁద్రావఁగ నెంచి కృష్ణరా
ఘునుఁ డయి పుట్టె విప్రుఁ డయి•గౌతమియొడ్డున నంచు నెంచుచున్. 47.

సీ. ఎవనిహూణాగమా•తివిభూతి తెల్పుఁ దత్ప్రాపకం బైన బి•యే పదంబు
ఎవనిభాషాభిమా•నవిభవంబు వచించు,నెంచి చేయించు స•త్కృతిచయంబు
ఎవనికవీంద్రగౌ•రవము చాటించు ము,ద్రాపితప్రాక్కవి•గ్రంధపటలి
ఎవనియగణ్యపు•ణ్యవిశేష మెఱిఁగించు,నత్తకోడండ్ర య•న్యోన్యమైత్రి
గీ. యతఁడు కొచ్చెర్లకోటవం•శాంబురాశి,చంద్రుఁ డురుకీర్తిసాంద్రుఁడు•శాంతిపరుఁడు
రామచంద్రవేంకటకృష్ణ•రాయచంద్రుఁ,డనితరప్రతిభాశాలి•యనియెఁదలఁచి. 48.

వ. విద్వజ్జనమనశ్చకోరచంద్రాయమానుండును సత్యభాషాహరిశ్చంద్రుండును భోగ
దేవేంద్రుండును నాశ్రితరక్షణోపేంద్రుండును నగు నాభూసురేంద్రుని కభ్యుదయ
పరంపరాభివృద్ధిగా నారచింపంబూను బుద్ధచరిత్రంబునకుఁ గథాక్రమంబు. 49.

## కథాప్రారంభము.

మ. ఇల సాకేతపురాంతికంబునను రోహిణ్యాపగాతీరమం
దలఘుప్రాభవ మైనమంచుమల కత్యంతంబు దాదాపునం
బొలుచు న్వీడొకఁ డెల్లవిద్యలు యశమ్ము న్సౌఖ్యము న్సంపదా
దులుఁడ న్నెప్పుడుఁ గొల్వఁగాఁ గపిలవస్తుఖ్యాతి సంధిల్లఁగన్. 50.

చ. అమితసితోన్నతంబు లగుహర్మ్యగృహాళిఁ గని వెండికొండ సె
త్తము లనుభ్రాంతి నొంది జలదంబులు నిచ్చలు విశ్రమించుచున్
బ్రమదమున న్నయంబునఁ బ్రభావమున న్రజతాద్రితోడఁ దు
ల్య మని తలంచు పౌరుల యథార్థమనీషలఁ జేయుఁ దత్పురిన్. 51.

ఉ. చౌకము గల్గుతన్నగరసౌధములన్ రతనంపుఁ గ్రొంజిగిం
జీఁకటి వోలె లేమియును జేర భయంపడు మందు నుత్తమ
శ్లోకులు పౌరు లంచు మదిలో ముద మందుచు నున్నదో యనన్
జోక యొనర్చుఁ దత్పురము చూపఱకు న్నడిరేయి నేనియున్. 52.

చ. పణముగ సింహకర్ణములపై రతనంబులు దాపినట్టి తో
రణముల రామణీయకము రంగులరంగులు నేపురంబుతో
రణముల కింక్లకెందును సరాసరి లేమిఁ బరస్పరంబుగాఁ
బణమున మీఱుచున్నగతి భాసిలుఁ దత్పురమందు మాడువుల్. 53

మ. తనపై నేత్రము గల్గుతమ్ములకు సంతాపంబు గావించువా
రని కాంతాముఖచంద్రులం జెనక నిత్యంబుం బతంగుండు త
ద్ఘనసౌధంబుల త్రోవఁ బోవుచుఁ గడుం గాలించియుం జూచి కా
నని చింతం బడుచుండుఁ బ్రత్యగుదధిం దాఁ గోపరక్తాంగుఁ డై. 54.

చ. శతమఖుఁ డౌనుగాక మనశాక్యనృపాలురతోడఁ దుల్యుఁ డే
గతి యగు నల్పు లిచ్చినప్రకారముగా బిరుదంబు చెల్లునే
యితనికిఁ గల్గునా బిరుద మేఁ దుడిపించెద నంచుఁ దత్పురీ
సతి పయికెత్తు కేలన ధ్వజంబులపై ల్లలరారునప్పురిన్. 55.

గీ. వీటఁ బొడవయి చద లంటు కోటగోడ హరిపదము ముట్టె నన్న నగును గాని
కడలివలె లోఁతు గల్గిన గడ్డ గూడ హరిపదము ముట్టెననుట మహాద్భుతంబు.

గీ. గజములో యని తలఁప న•గజుఁ డగుచు, నాగసుతయని తలఁపోయ•నగములగుచుఁ
గొండవాడుగఁ బురిచుట్టు•నిండియుండుఁ, గొండములుగల్గునట్టి జం•తుప్రజంబు.

గీ. శాక్యపరిపాలకుండు వి•స్తారయశుఁడు, విక్రమక్రమవంశుఁడు•చక్రవర్తి
యేలు నప్పట్టణం బమ•రేశ్వరుండు, నాఁగ శుద్ధోదనుండు స•న్మార్గధనుఁడు. 58.

గీ. సకలసామంతమూర్ధాభి•షవనగలిత, కలితజలబిందుకలబిందు•ఖండమండి
తోజ్జ్వలాంగుఁడు నైనశు•ద్ధోదనునకు, ధర్మమునఁ దమ్ముఁ డౌక్కావ్య•ఘనుతుండు.

చ. జవసహాయంబు నెక్కరథ•సంబును రాజులు మెచ్చులాడఁగా
నెవఁడు కరాసిచే నణుక•నీక్షినధాత్రిపకన్యకేంద్రము
ల్పవిలీన నెత్తలం బలకఁ•బాజిన ముత్తెపుఁ జేర్లు ప్రక్కచుం
బువులను దోయిలించుగతి•బోఁగిలఁబడు సంగరస్థలిన్. 60.

మ. ఉపరాగంబులు నిగ్రహించి రవి లో•కోన్నోదముం జేయు న
ట్లుపకారం బొనరించుశాత్రవులఁ జ•క్కాడించి శుద్ధోదనుం
డుపకారం బొనరించుచుం బ్రజలపై•నుల్లాసముం జూపుచుం
గృప నీలోకము నేలెఁ బెగ్గడలయుం•గీకారము ల్తోడుగన్. 61.

వ. భూభృద్వరుం డయ్యు సపక్షపాతుండు నీశ్వరుం డయ్యు సమదృష్టిప్రసారుండు
ను బ్రవృత్తదానుం డయ్యు మదానుపేతుండును నగు నాశుద్ధోదననృపాలుండు
సకలసామంతనృపాలసమర్ప్యమాణ మదావళమదధారావాహినీపంకిలభవనాంగ
ణుం డై రాజ్యంబు సేయుచు, మాయాదేవియు, గౌతమియు, నను నిరువురు వెలందు
కలం బెండ్లియాడి సుఖం బుండె. 62.

సీ. తానకం బేకాంత • దైవభక్తికి సాధు, గురుజనాసక్తి కే•తరుణి కుదురు
ప్రజలపాలింటి కే•భామిని జనయిత్రి, చుట్టాల కేసాధ్వి • పట్టుఁగొమ్మ
పతి కేసరోజాక్షి • పంచప్రాణంబులు, పరిశుద్ధి కేతల్లి • పాలవెల్లి
కరుణానివాస మే•కలికి భృత్యుల కెల్లఁ, గులకామినులకు నే•లలన యొజ్జ

గీ. నిజముగఁ గటికిచీఁకటి•నియతి గలుగు, కలికికొలఁకుల కేదేవి•వెలుఁగుఁ దెచ్చు
మణి యగుచు నట్టి పతిరతి•మాయవంటి, నెలఁతుకలు ముజ్జగంబున•నిండుసున్న.

ఉ. ఆరమణీలలామ యొక•యామినియం దొడికంపు కేలికా
గారమునందు మంజులతఁ•గ్రాలెడుపాన్పున భర్తఁ గూడి స్వే

చ్ఛారతుల నైలంగి యొకస్వప్నము గాంచెను నిద్రలోన సం
భోగహామిత్రమండలము హా స్తకజామున గొప్పునప్పుడున్. 64.

గీ. వట్టి కరణయుక్త మైన నక్షత్ర మొకఁడు, పోటలప్రభ దిక్కులం దీటుకొనఁగ
నాకసమునుండి కుడిప్రక్కఁ దాఁకి తనదు, గర్భమునఁ జొచ్చినట్టు లక్కలఁ దెలుసు.

వ. ఇ ట్లుత్తరోపరి కలఁగాంచి యల్లన మేల్కని యక్కలు నిక్కము లనపతికిం జెప్పి
పదపడి బంధుజాతమ్మున కెఱిఁగించిన శుభసూచకం బగుట నెల్లరు నానందించి
పొదలుచుండఁ గాక. 66.

శా. యావద్భూపరిపాలకుం డయినశాక్యాధిపురాజ్యంబు తా
నై వర్తించు ప్రజ ల్క్రమక్రమముగా నవ్వార్త యందంద యెం
తే వేడ్క న్విని చావుపుట్టుకల మాయించించు నిర్వాణభూ
త్యావిర్భావము చెందినట్లు గని రత్యంతప్రమోదస్థితిన్, 67.

చ. వెనుకటికన్న నెల్లపృథివీవలయంబును బాడిపంటలం
దనరుట యాదిగాఁ గలుగుతత్తదశేషవిశేషము ల్గనుం
గొనుచు నృపాలురాణి కలకుంభిని కెల్లను మోదదాయి య
య్యె నని యపార మైనసుఖ మెందును జెంది రనేకభంగులన్. 68.

చ. పదపడి రాజునానతి నభాస్థలి స్వప్నఫలప్రదర్శకు
ల్విదమలరంగ స్వప్నఫలము స్వచియించిరి దేవ యెంతకే
నిఁదగినస్వప్న మీయది గణింపఁగ శక్యమె నీదుభాగ్యసం
పద జగదేకరత్నము నపత్యముఁ గాంచెదు నిశ్చయంబుగన్. 69.

శా. ఆపుణ్యాత్ముఁడు సార్వభౌమపదవిం బ్రాపించి సామంతభూ
మీపాలు ర్దనుఁగొల్వ నెల్లరుసు మేలౌ లంచు శ్లాఘింప నా
శాపాలేశునిభంగి యీభువనము న్పాలించుఁ గాదేని వి
ద్యాపూర్ణుం డయి సర్వలోకులకు నిత్యానంద మిచ్చుం గృపన్. 70.

క. పదపడి యమ్మానిని దౌహృదలక్షణము వ్వహించె హృదయేశుఁడు స
మ్మద మందఁ బ్రథమగర్భం,బది భర్తకు మోద మిచ్చు టబ్రం బగునే. 71.

ఉ. ఈరుచిరంపువార్త విని యెల్లర సెమ్మది మోదమట్ల వి
స్ఫారతఁ గాంచె గర్భ మలసాధ్వికిఁ దానఁ బ్రతిక్షణంబున

న్గోరుకు శిరిక గ్లాభిపెc గోమలికి న్నాగ మెల్ల వెల్లనై
యారయ నయ్యెc జూచుకములం దొడవె న్నలు పంతకాంతికిన్. 72.

సీ. ఉదరమునయందు భగవంతుcడుంటc జేసి, యధికశోభ వహించె నయ్యదితిపురాణి
వెన్నెలలకన్ని దెసలాక్రమితములైన, వెండిమలదొత్తముల హెచ్చియుండుcగాదె.

గీ. మించుc గడుప్రసభరియించు మేఘమాల. పొల్పcపసలోన బోధిసత్త్వుని ధరించి
ధరణి దీనాళి దారిద్ర్యతాపభరము,మాయ ధనవృష్టిc గురిపించె మాయ యపుడు.

క. పరిపూర్ణగర్భవతి యై, సరసిజముఖి పుట్టినింటి చాయకు వెంటం
బరివారము రాc జనునవ,సరమున దారి నుపవనము చక్కటి నొకటన్. 75.

చ. అనయముc బూలc దీండెల ఫలావళులం గులcదూcగుచుండు లం
బిని యనుచెట్లతోcపుc గడు వేడ్కc జొలర్పcగc జేరునంతc బ్ర
క్కనc బ్రసవంపుభంగి యొక కొంత కనంబడ నాపె యాన మొ
య్యన నిలువంగc జేసి డిగి యల్లనc గొండొక యేగి యొక్కెడన్. 76.

వ. నిలువంబడి యొక్కపలాశవృక్షశాఖ చేతులం బట్టుకొని ప్రసవవేదనాపరవ
శయై యుండుపట్టున నప్పలాశవృక్షంబు. 77.

మ. తనకొమ్మల్ దిగవంచి యెల్లెడలc బత్రవ్యాప్తిc గావించి సూ
ర్యనిరోధం బొనరించె గొడ్డుగతి నారా వింత యాసాధ్వి ని
ల్చినచోట న్నయనీయ మట్లు మొలచె న్లేజొంపము ల్పూలు మీc
దను సెజ్జొక్కటి వచ్చె దాపునను నేత్రప్రీతి సంధింపుచున్. 78.

ఉ. ఇట్టివిచిత్రచర్యలకు నెల్లను నెల్ల సమస్తవిద్యలం
ఘట్టుcడు కాcగలాcడు పరతత్త్వవిశారదుc డార్యసంతతు
లట్టినభాగ్యరేఖ యల కాంతకుc బుత్రకుc డై క్షణంబునం
బుట్టె సమస్తలక్షణస ముజ్జ్వలమై తనమూర్తి యొప్పcగన్. 79.

గీ. మొగిలుతెర దాcటి రవి వచ్చు పగిదిమాతృ, కుక్షి వెడలిన యాజగద్రక్షమూర్తి
యొడలిసంచులు వన మెల్ల యెడల నిండి, పండు వొనరించె బాలాతపంబుమాడ్కి.

క. చందనయూపముతో సరి, యందము గలశాక్యభూవరార్భకుమీcద
న్మందారపుష్పవర్షము, బృందారకు లెల్లరుc గురిపించిరి పేర్మిన్. 81.

ఉ. అల్లలనాడె వాతహతమై తరిలాగుధరిత్రి యంతయుం
జల్లనిగాలి వీచె రవిచంద్రులు మున్నటికంటె హెచ్చు భా

సిల్లిరి దిగ్గజంబులకు • నిశ్చలదయించెను బొర్లె వార్ధులున్
మొల్లము పల్లవించె నగము • ల్మహనీయనిజప్రవేశలన్. 82.

మ. అహహా! యెంతమహానుభావుఁడొ కదా • యీపండు దిక్పాలకు
ల్మహి కేతెంచి ప్రసూనవర్షముగ భ • క్తిస్ఫీత మై యెక్కు డా
రహి నొప్పారెడి యానమం దునిచి గ • ర్వం బింతయు న్లేక తా
ర్వహియించం దగువారలై నగరికిం • బ్రాపించి రప్పట్టునన్. 83.

గీ. సురలు మోయుచు కలాచికో • పరిఠెలమున, జనని యొడికట్టులోపలఁ • దనరునిసువు
సంజకెంజాయచాటున • జనులచేతఁ, జూడఁబడు బాలశశిరేఖ • జాడఁ జెందె.

వ. ఇట్లు దిక్పాలకానీతం బగుయానంబు కపిలవస్తుపురవీథిం జనుదెంచుసమయంబున నబ్బురంపడుపౌరు లందఱు నాకస్మికం బగుతదుదంతంబు సాంతంబుగా విని ముందుఁ జని శుద్ధోదనున కెఱింగించిరి. 85.

క. కని శుద్ధోదనుఁ డానందనిమగ్నుం డయ్యె దేవ • తలు మనుజులు నాఁ
గను భేద మించుకయు లేక నియతమోదాతిశయము • నందిరి పౌరుల్. 86.

గీ. పుడమి యెంతపెట్టి • పుట్టెనే యనియు శుద్ధోదనుని దఖండ • యోగ మనియు
నతనిభార్య కెవ్వ • రైనను లా చ్చని,యు సురలెల్లఁ బొగడి • రనక మెసఁగ. 87.

చ. మును గలనాఁడు పండితు ల • మోఘవచస్కులు చెప్పుమాట లీ
దినమున లక్షణాఢ్య మగు • తేజము వొల్చెడు పుత్రచందము
న్మనమున నెంచి యీతఁడు స • మస్తనృపాలశిరోవిభూషణం
బనఁ దగురాజచంద్రుఁ డగు • నా నని సంతన మందెఁ దండ్రియున్. 88.

గీ. అంతిమే కాని సంసార • మవలఁ ద్రోచి, జ్ఞాని యై జ్ఞానులను నెల్ల • జ్ఞానబోధ
మొలవఁ జేయుచు సన్న్యాస • మును వహించు, నని యెఱుఁగఁ డేరి కెఱుక భా • వ్యర్థగతులు.

సీ. ఐరావణము నైన • నక్కఁ దన్నఁగఁ జాలు, చేవగల్గు ననేక • పావళులును
నుచ్చైశ్శ్రవనముతో • నొఱపుఁ జూపెడి చక్క,నైనవేగము వొల్చు • నశ్వతతులు
పవితోడ నెదిరించి • పవరం బొనర్పఁగఁ, జాలినయాయుధ • సముదయములు
చింతామణికి సిగ్గు • చేయఁజాలెడి మంచి, నిగ్గు గల్గినరత్న • నికరములును

గీ. బుసుఁగుఁ గస్తూరియు జవాజి యును ననర్ఘ,మైన ముత్యాలహారమ్ము • లట్టిసేలు
వలు నుపాయనముగ మహీ • పతులు చూడఁదరలి వచ్చిరి తండోప • తండములుగ.

ఉ. వెండియు నాఁడు సంతసము • వెల్లిగొనంగను పౌరులెల్లఁ బా
ర్మండన మాచరించి మృదు • మంగళనిస్వనసృత్తగీతము
ల్మెండుగ నెల్లచోటులను • మేకొనఁ గేవలసౌఖ్యమగ్నులై
కొండొకసంగతు ల్దలఁప • నొల్లక వర్తిలి రేకరీతిగన్. 91.

చ. చిరమున నుండి తాఁ దపము • సేయుచు యోగసమాధి నున్న స
త్పురుషుఁడు వృద్ధమూర్తి యసి • తుం డను నొక్క మహానుభావుఁ డు
ద్ధురగుణుఁ డైనబుద్ధుఁ డొక • తొయ్యలికిం జనియించె నంచు నం
బరమున నొక్కవార్త విని • పట్టఁగరానికుతూహలంబునన్. 92.

క. అమరగతిఁ గపిలవస్తుపురమునకుఁ జనుదెంచి వేగ • రాజన్యుని సౌ
ధము చొచ్చి యచ్చటిప్రజా, సముదాయముతోడ రాజ • సన్నిధి కరిగెన్. 93.

ఉ. వచ్చినమౌనిఁ గాంచి జన • వల్లభుఁ డల్లన లేచి మ్రొక్కి లో
మెచ్చుచుఁ బాద్య మిచ్చి మది • మెత్తని బత్తియుఁ దత్తరింప నీ
యిచ్చ యొనర్తుఁ జెప్పఁగద • వే యని చేతులు దోయిలింపఁగా
నచ్చపుఁబేర్మి నిట్లనియె • నమ్ముని తేనియ లొల్కుపల్కులన్. 94.

ఉ. ఈవినయంబు క్రొత్త యగు • నే కులపూర్వులపోల్కిఁ గాక నీ
కీవి నయంబున న్ప్రజల • నేలుటయందు సమాను లెవ్వరో
కోవిదమాన్య నీవు జన • కుండవుగా నుదయించె బుద్ధుఁ డం
దేవుఁ డటంచు వింటి విని • దేవరఁ జూడఁగ నిట్లు వచ్చితిన్. 95.

ఉ. నావుడు రాజచంద్రుఁడు మ • నంబున నుబ్బుచు లేచి వెంటఁ గొం
పోవఁగఁ బోయి కాంచె ముని • ముద్దులబాలు దయావిశాలు నీ
రావసితాంగుఁ జక్రకమ • లాంకితపాదుఁ గళావినోదు దం
తావళవస్తికేశు జన • తానుతరూపు నిరస్తపాపునిన్. 96.

గీ. గారితోడమీఁద నున్నకు • మారుపగిదిఁ, దల్లియొడి నున్నపాపని • దనియఁ గాంచి
మరలె యతియును గన్నుల • దొరలునీరు, వంచి యొప్పులచేనప్పు • ళించుకొనుచు.

గీ. తనయుఁ గని కంట నీ ర్వెట్టు • తపసిఁ గాంచి, యేఁ డిదియో కత మంచు శు • ద్ధోదనుండు
కాలు చేయి వడంకఁగ • గద్గదస్వ, రమ్ముతో నిట్లనియె దై • న్యరసము గదుర. 98.

క. కడునద్భుతజన్మము గల, కొడుకుం గని దేవుఁ డనుచుఁ గొనియాడియు నా
కడుపు పగులంగఁ గన్నులఁ, గడుకొల్పితి నీ కి దేమి కతము మహాత్మా. 99.

మ. పలితాత్ముండను ముప్పువాఁడను మృతప్రాయుండ నాకుం జలాం
జలి యిచ్చుం బరియింపఁజేయు నని యుత్సాహంబుతో నున్న యూ
హలపా వెల్లను గంగలోఁ గలిసె దీర్ఘాయుండు కాఁ డేమొ కాఁ
గలకార్యం బెఱిఁగింపఁగావలె నపస్మారంబు గావించెదన్. 100

క. కన్నులు తెఱవనిపాపఁడు, చిన్నారిమొలుంగు గల్గి చిఱుతఁడు పెంపుం
జెన్ను గను నంచు నున్నాఁ, డన్నె దురదృష్టవంతుఁడను గాను గదా! 101.

మ. గుణమూరుం డగునో! సదా ప్రజలబాగుం గోరెడో! శత్రుమా
రణభీరుం డగునో! కరంబుఁ బరదారావిత్తముల్ గోరునో!
పణవీరుం డగునో! నయంబు గనువిద్వాంసుండు గాఁడో! దయా
చణభారుం డగునో! విరాగమున సంసారంబు వర్జించునో! 102.

గీ. అనుచు నశ్లీలమునకు భయంబుఁ జెందు, కపిలవస్తుపురీంద్రునిఁ గాంచి మౌని
భయముఁ జెందకు మయ్య నృపాల యనుచు, భావిగతిఁ జెప్పఁబోవు నవసరమందు.

శా. అంతంతం గని యమ్మహామహుని మాయాదేవి లో నెంతయు
న్సంతోషం బిగుర్కొత్త నమ్మునిపదాబ్జాతద్వయిన్ వైచె శ్రీ
మంతుండుం గుణవంతుఁడు న్మిగుల ధీమంతుండు నాయుర్యశో
వంతుండు న్సుతుఁ డౌ న టంచు నటువైవ న్యోగి దీవన్పులన్. 104.

చ. తొలఁగి భయమ్ము భక్తియును దోఁకముగాఁ గనుపట్ట నవ్వరో!
తెలియఁగలేవు గా కితని తేజము సర్వజనాభివంద్య మి
య్యలఘుఁడు నమ్ముఁ డెల్లరకు నారయ నీతని కెంపెపెద్దవా
రలును ననమ్యులంచును గరమ్ములు మోడ్చి నమస్కరించుచున్. 105.

క. ఆతనిపాదము లుంచినభూతలమునధూళి హస్తమునఁ జేకొని య
త్యాతతభక్తి న్శిరమున, వేతాలిచె నతఁడు తత్త్వవేత్తృత నెగడన్. 106.

చ. ఎనిమిదిసార్లు ధూళి గదియించి శిరమ్మున నంతఁ బోక య
య్యనఘుని యంఘ్రులందుఁ జెలువారెడు చిహ్నములెల్లఁ జూచి యిం
తని యనరానిమోదమున నమ్మహనీయుఁ గుతించి దైవభా
వన దనరంగ నిట్లనె నవార్యము లై పులకల్జనింపఁగన్. 107.

క. బుద్ధుండ వై జగముల కవి,శుద్ధం బగుజ్ఞాన మిచ్చి • ప్రోచుచును సనం
బద్ధప్రమతేయులఁ ద్రుంచుచు, నిద్ధచరిత నెగడఁ బుట్టి • తివి మహాత్మా! 108.

క. ఏ పతివృద్ధుండ నగుటన్; జ్ఞానము నీవలనఁ బొందఁ • గా నోఁచఁగ నే
నైనను జగ మెల్లను ని,న్నూని తరించుటకు శంక • యుండదు దేవా. 109.

క. తన కప్రాప్యం బైనది, కొనవచ్చునె చాలి కేని • గుణఘని పగు నిం
గనుఁగొనఁ గలైను సంపన,సుచు బొందితి నింతకన్న • భాగ్యము కలదే. 110.

వ. అని శుద్ధోదనుఁడిక్కుమొగం బై యి ట్లనియె. 111.

క. జర తరగలుగా మరణము, ఘోరముగ రోగములు సుడిఁగు • చందఃముగా దు
స్తర మగుసంసారాబ్ధిం, దరియింపం జేయు తరి యి • తండు నరేంద్రా. 112.

క. వ్రతములు చక్రంబులుగాఁ, బ్రతిభ జలంబుగ సమాధి • పారంబులుగా
వితత మగుధర్మనది నీ,రితఁడే త్రావించువాఁడు • తృష్ణార్దితులన్. 113.

క. విషమం బగుచును దత్త్వద్విషయావృత మైన తప్పు • తెరువునఁ బడుకి
ల్బిషవంతుల కితఁ డకి,ల్బిషమోక్షపదంబుఁ జూపుఁ • బృథ్వీనాథా. 114.

గీ. విషయశుష్కేంధనమ్ములు • విస్తరిల్లు, మోహదావాగ్నిలోఁ బడు • మోహితులకుఁ
బ్రాణదానం బొసంగి కా • పాడుకొనుకుఁ, గారుక్రమ్మిన ఘనఘనా • ఘన మితండు.

మ. నరపాలైకశిరోవతంస! కడుధ•న్యం బయ్యె నీపుట్టు వె
వ్వరు నీకు న్సరి గారు నీగృహముసౌ•భాగ్యం బగణ్యంబు జ్ఞా
నరసాయత్తత నెల్లలోకముల య•జ్ఞానంబు వోఁ గొట్ట ని
ట్టిరు లా మెచ్చుటనో జనింప్రు చిరరూ•ఢిన్ దేవతాంశంబునన్. 116.

వ. అని వెండియు. 117.

చ. నరవర యొక్క కారణము•నన్ భవదీయగృహంబు దృష్టవ
త్తర మనియు న్వచించుట కొ•దం గడు సందియమందు చుంటి నె
వ్వరికిని జన్మ మన్నది ప్ర•పంచమునం గడు దుఃఖదం బ టం
చరసినవారికి న్మరణ•మన్నను జంకు జనింపకుండెడిన్. 118.

వ. అని మాయాదేవి వంకఁ జూచి కనుఁగొనలం జాఱునీ రత్యధికం బై నరేంద్రు
హృదయంబు పగులం జేయుచు ని ట్లనియె. 119.

శా. ఏతాదృక్షమహానుభావునకు మా♦హాత్మ్యంబు చేకొన్న స
త్ప్రాతిప్రత్యగుణాభిరామ వసనీ♦హాము లొప్పారఁ బొందు టే
లా తప్పున్ విను నేఁటి కేడవదినం♦బందున్ భవత్కాయసం
ఘాతం బా నిజ సౌఖ్యదుఃఖముల సం♦బంధంబు నీ కేటికిన్. 120.

మ. అని యయ్యోగి తనంతఁ దాఁ జనియె మా♦యాదేవియున్ యోగి చె
ప్పినకాలంబునకున్ మృతిం గని జగ♦ద్వేద్యంబుగా దేవతాం
గన లెల్లం దనుఁ గొల్వ స్వర్గమున వే♦డ్కన్ మీఱఁగా నొప్పె స
త్యనిధుల్ యోగులు సెప్పువాక్యము లసం♦త్యమ్ము లౌదా యేరికిన్. 121.

వ. పదంపడి రాజును గొంశోక విచారించి గతంబునకుఁ గర్తవ్యంబు గానక యత నిం బెంచుటకుఁ దన ద్వితీయకళత్రం బగుగౌతమి నేర్పఱచిన నామెయుం దన కన్నకుమారుంబలెఁ నొడియం దిడుకొని నంత. 122.

క. జ్ఞాని యగునీతఁ డితరుల, జ్ఞానం బిడి యిట్లు ప్రోవఁ♦గలఁ డనుగతి న
ద్దానిచనుఁబాలు బాలుని, ప్రాణంబులు నిలిపి పెనిచె♦ బలుపు మిగులఁగన్. 123.

వ. శుద్ధోదనుండును బదియవదినంబున, సర్వార్థసిద్ధుం డనునామం బొనరించినఁ బౌరు లందఱును నీతనిపుట్టువుకతన సర్వార్థసంసిద్ధి గాఁగలదు గాన నప్పేరు సార్థకం బగు నని సంతసించి రంత. 124.

సీ. నెల మూఁడువానలు♦నియతిగా వర్షించెఁ, బుడమి సదా సస్య♦పూర్ణ యయ్యెఁ
గుంభస్రుతిగఁ బాలు♦గురిపించె గోవులు, చతురంగబలము ♦ విస్తార మయ్యె
నరిరాజులకు భయం♦కర మయ్యె రాజ్యంబు, దుర్మార్గులకుఁ బ్రోలు♦దూర మయ్యెఁ
గులకామినులయందు♦గొడ్రాలు లే దయ్యెఁ, జారచోరులబాధ ♦ సమసి పోయెఁ

గీ. పాపము నశించె ధర్మంబు♦పాదుకొనియెఁ, గఱవు కఱవయ్యె లేమికిఁ♦గలిగె లేమి
కపిలవస్తుపురేంద్రున♦గారమందుఁ, బిన్న నెలమాడ్కిఁ బుత్రుండు♦పెరుఁగుచుండ.

చ. అడిగిన నీనివాఁడు వ్రత♦మన్నను జేయనివాఁడు కల్లనా
జడియనివాఁడు బందుగుల♦సఖ్యము గోరనివాఁడు కొండెము
ల్వాడివెడువాఁ డసూయ మది♦లోఁ గలవాఁ డొకఁ డైన బోధిస
త్త్వుఁడు గలరాజ్యమం దరయఁ♦బోయిననుం గనరాఁ డొకప్పుడున్. 126.

క. పూవుందోఁటలు నూతులు, బావులు సత్రములు దేవ♦భవనంబులు పెం
జావడులును గట్టించిరి, భూవరతనయుండు వృద్ధి♦పొందం జనముల్. 127.

క. ధనముం దాఁపఁడు కామ, మ్మునకై ధనమునకు ధర్మముం జేయఁడు ధ
ర్మనిమిత్తము ప్రాణులపైఁ, గనికరముం బాయఁ బోఁడొకం డైనఁ బురిన్.

వ. ఇట్లభ్యుదయోన్ముఖంబై క్రమక్రమంబుగా వర్ధిల్లు కపిలవస్తుపురీంద్రునిరాజ్యంబు పగిది సర్వార్థసిద్ధుండును వృద్ధిఁ బొందుచుండె. 129.

గీ. అంత నెన్మిదియవయేఁట నవనిపతియుఁ, గొమరునకు విద్యలను గఱపంగఁ జేయ
నెంచి మంత్రులతోడ యోజించె దగిన, దేశికుఁ డెవ్వఁ డీరల తెల్పుఁ డనుచు.

ఉ. అంతియె కాని యీతఁడు మహాత్ముఁడు వీనికి నిట్టివిద్య లా
వంతయు జ్ఞానదాయకత నందమి నిక్కము భూతపూర్వమై
యంతయు నిమ్మహామహుని యందలరారు నటం చెఱుంగఁ డా
సంతతియందు వత్సలత సర్వము నుస్మఱపింపఁ జేసెడిన్. 131.

వ. ఇట్లాడయుం డడిగినఁ బ్రెగ్గడ లందఱి ట్లనిరి. 132.

శా. విద్యావంతుల కేమి యెల్లయెడల న్విచ్చేసి యున్నారు నం
సద్యోషామణిభూషణాయితుఁడు విశ్వామిత్రుఁ డాధీరుఁ డే
తద్యోగం బొనరింపఁగాఁ దగిన విద్వాంసుండు నీవాత్మజున్
సద్యం బాతని కొప్పగింపు మణివాసశ్శ్రీల నర్చించుచున్. 133.

చ. అనవుడు నట్లకాక యని యానృపుఁ డాబుధుఁ బిల్వఁ బంచి పు
త్రుని శుభ మాముహూర్తమున నోరపుటుత్సవ మాచరించి య
య్యనఘున కొప్పగించె మణిహారపరంపర లగ్రహారముల్
ధనమును ధాన్యము న్సముచితంబులు వస్త్రము లిచ్చి పుచ్చుచున్. 134.

చ. కరమున రత్నపుంబలకఁ గైకొని మేటివినీతి యొప్ప నా
దరమున నగ్రభాగమునఁ దన్నృపపుత్రుఁడు నిల్వ నాసుధీ
వరుఁ డిది వ్రాసికొమ్మనుచు వ్రాయఁగఁ జేయుడుఁ బూర్వమంద తా
నరసినవాఁడువోలె నదియల్లన వ్రాసి పఠించు నంతలోన్. 135.

ఉ. ఆతఁడు చెప్పఁజేకొదవ యా గతి విద్యలనెల్ల నాజగ
న్నేతకుమారుఁ డెక్కుడగు నేర్పుల రం గ్రహియించె నెన్నఁగా
బ్రాఁతియె వానిసంఖ్య యొకభాషయె యొక్కొకపుస్తకంబొ యే
రీతి గణింపవచ్చు విన రే మును ప్రాక్తనవిద్య లబ్బుటల్. 136.

గీ. ఏది చెప్పినఁ దనకన్న నెక్కుడుగను, దిరిగి చెప్పుటఁ జూచి యాదేశికుండు
మనుజమాత్రుండు గాఁడని మదిఁ దలంచి, పడియె సాష్టాంగముగ నుపాధ్యాయుఁ గళి.

వ. అంతం బోక మఱియు నిట్లనియె. 138.

క. ఏ నీశిష్యుండ నాకు న, నూనం బగుమతివిశేష మొదవఁగ నీవే
ధీ నెగడఁజేయ నొజ్జవు, నానేర్చిన దించుకయు నను లే దనఘా. 139

వ. అని చెప్పి యతండు తద్వృత్తాంతంబు శుద్ధోదనున కెఱింగించి యతనిచే నుపాయనంబుగఁ గాంచనాంబరాగ్రహారాదికంబులు గ్రహించి తనయిచ్చం జనియెఁ బదంపడి నృపసూనుండు. 140.

చ. కలల నఖండుఁ డయ్యు మదిఁ గర్వము దాల్పక బల్పరాక్రమం
బలవడియుం గృపాపరత నంది చరించుచు నశ్వశిక్షయం
దలఘుతఁ గాంచి స్యందనవిహారములం గడిదేఱి చాపవి
ద్యలఁ బ్రబలత్వ మూని వితతప్రతిభం జెలువారె సామునన్. 141.

వ. ఇట్లు ప్రాగ్జన్మసంస్కారవిశేషంబునం గలిగినవిద్య లన్నియు నేర్చి సవయస్కులగుబాలురతోఁ గూడ నాడునాఁడు. 142.

ఉ. వేఁటకు నేగి తద్విపినవీథులఁ గ్రుమ్మరుచు న్మృగాళి నే
పాటియు గాసిపెట్టక యుపాయమునం గ్రహియించి చంపక
మ్మేటి కృపాళుఁడై విడుచు మించినవేగమునం జరించుటన్
ఘోటకమూర్తిఁ గూరఁ గృప గొల్పి వృథాగతి మాన్పు నిల్పుచున్. 143.

క. శోకము బాధయుఁ గన్నీ, రాఁకలి యనుశబ్దములను నుతఁ డెఱుఁగుం ద
ద్వ్యాకులత యించుకేనియు, నాకరుణాకరున కెఱుక యనఁ దగ దొకటన్. 144.

వ. ఇట్లు దశహాయనుం డగునాసర్వార్థసిద్ధుండు కృపైకగుణావలంబి యై కాలయాపనం బొనర్చుచు నొకనాఁడు దేవదత్తాదు లగు తనమిత్రులతోఁ గూడి. 145.

చ. ఉపవనసీమలందు సొబగొప్ప విహార మొనర్చుచు న్మనం
బపరిమితప్రమోదమయమై యలరార హిమాద్రిచెంత కే
గి పులుఁగులం గనుంగొనుచుఁ గేళి యొనర్చుచు నున్న యంత వ్యో
మపథమునందు నంచలసమూహ మొకం డొకచక్కిఁ గన్పడెన్. 146.

ఉ. కాళులతీరు ముక్కులచొకారము ఱెక్కలసౌరు నెమ్మదిన్
హాళి యొనంగఁజేయ నృపుఁ డంచలబంతిఁ దదేకదృష్టి గా

లోలుపతం గనుంగొనుచు • లోఁ గడు మెచ్చుచుఁ బజ్జ నున్నమి
త్రాళికి వానిచిత్రముల • నారయఁ జేయుచు నున్నవేళలన్. 147.

గీ. దేవదత్తుం డలుఁగొకండు • దీసి పింఛి, యందు సంధించి కరుణ యింత • యయిన లేక
యొక్కయంచను గొట్టనా • పక్కి యెక్క, లాఁగ లేక భువింబడె • నాక్షణంబ. 148.

క. నెత్తురు టెక్కలఁ దొరఁగఁగ, నత్తఱిఁ గున గిలగిల మని • యాహంసము వే
ఱెత్తిన శోకభరంబునఁ, గుత్తుకలడియాడఁ బడుట • కు న్నృపుఁ డెడఁదన్. 149.

క. కడలేనికనికరము గని తొడ నిడుకొని నల్ల నల్లఁ • దుడుచుచు మేనం
గడులోఁతుగ నాటినయలుఁ, గెడలించిన నంచ మఱియు • హెచ్చినయార్తిన్. 150.

క. గిలగిలఁ గొట్టికొనఁగ న, య్యలఘుం డిది యేల యిట్టు • లార్తిం గను న
మ్మలికిం బుచ్చితిఁ గాదే, కలిగెనె వే యెద్దియేనిఁ • గారణ మనుచున్. 151.

క. తనకాయమునం దయ్యలుఁ, గును గ్రుచ్చియుఁ బుచ్చియును బు • గుల్కొనునార్తిన్
దనలో నెఱింగి యనుభవ, మునకుం దెచ్చికొని మిగుల • మొనసినకరుణన్. 152.

గీ. అనఁటిమొవ్వువంటి • యయ్యంచ యెక్కల, నేర్పుకొలఁదిఁ గేల • నిమురుచును వ
నౌషధీరసముల • నద్దాని క్షతి కొంత, యుపశమింపఁ జేసె • నృపసుతుండు. 153.

వ. ఇట్లు సహజప్రాణిహింసాదూరుం డగుసర్వార్థసిద్ధుం డయ్యంచ కిట్లు నైక విధోపచారంబు లొనర్చుచుండ దానిం గొట్టినదేవదత్తునిభృత్యుండు చనుదెంచి మాదొరయంచను నాచేతికి మ్మనుటయు. 154.

క. నృపసుతుఁడు వల్కెఁ బ్రాణ, వ్యపేత మగునేని వాని • కగుఁ జుమ్మిది ప్రా
ణపరీతమగుట నటు కా, దపమార్గం బేరి కైన • నర్హం బగునే. 155

వ. అనవుడు భృత్యునిచే నివేదితుం డగు దేవదత్తుండును నయ్యెడకు వచ్చి నాయంచ నీవు గైకొను టనుచితం బన రాకొమరుం డిట్లనియె. 156

గీ. ఆకసమున నిద్ది • యల్లన నెగుగు నే, శక్తికతన నట్టి • శక్తి మాత్ర
మీవు సంహరించి • తిద్దాని జీవంబు, నెడప నైతి నీది • యెట్టు లిద్ది. 157.

గీ. దైవవిహిత మైన • దయ కల్మి నాకు నీ, యంచ బ్రతుకఁ జేయు • నంతపాటి
యవసరంబు గల్గె • నక్కాఁగణమున నా, యదియె యిద్ది యొరుల • దగుటయెట్లు. 158.

వ. అనవుడు దేవదత్తుండును నిట్టియన్యాయోక్తు లాడం బాడియె మదీయబాణనిహితం బగుహంసంబు నాది యనుటకు సందేహ మేమి యనుచుఁ గలహింపం దొడం

గిన యమ్మిత్రుని మనంబు మెప్పించుటకు నొడంబడని మనంబుతోఁ బల్కు లయనున
యం బుట్టిపడ నయంబుగా నాభూవరతనయుం డి ట్లనియె. 159.

క. ఇందులకు నెల్ల వేని గ•నందగు సభవారు చెప్ప•నాయంబును బే
ర్కందినవిద్వాంసులు సభ,యం దుందురు పోయి వారి•నడుగుట తగదే 160.

క. అన నతఁ డీకొన నిరువురుఁ,జని సంస్థానస్థవిబుధ•సత్తములం బ
ల్కినయమున నడుగ నొకరుం,జనరుచితం బైనత్రోవ•సందియపడుచున్. 161.

వ. అట్టియెడ భగవంతుం డగునొకవిద్వాంసుండు నిష్పక్షపాతం బగుమతంబుతో
ని ట్లనియె. 162.

క. ఈనిఖిలజంతువులకును, బ్రాణము ముఖ్యంబు దాని•రక్షించిన య
వ్వానిది తదాధిపత్యం,బీనాయము నొప్పవలయు•నెల్లరు సభ్యుల్. 163.

గీ. అంతియే కాని ప్రాణిహిం•సాచరణము,కరుణలేక యొనర్పఁగఁ•గడఁగువాఁడు
తగునె దానికి నాధిప•త్యము వహింప,ననుభవవిరుద్ధ మిది ధర్మ•మగుట యెటు.

క. ఈసిద్ధార్థుఁడు దీనిఁ గృ,పాసహితుం డగుచుఁ బ్రోచు•వాఁడై యలుఁగుం
దీసి తనయొద్ద నిడుకొని,గ్రాసాదిక మిడుట నితనిఁ•గా దనఁ దరమే. 165.

వ. మఱియు మృగయావినోదంబునం బాణహతం బగుప్రాణి యేదేనియుఁ బ్రాణి
యున్నంతదనుక నాహతకునిది గా దనున్యాయంబు సర్వసమ్మతంబు గావునసీ
యంచ సర్వార్థసిద్ధునిదే యని నొడవిన రాజును విని యానందించి కుమారుని
కృపావశత్వమునకును విద్వాంసుని నిష్పక్షపాతబుద్ధికిని మిగుల సంతసించె. 166.

గీ. నాఁటఁగోలె నెల్ల•నరులకు నేప్రాణి,నేని హింసచేయు•నెడ గ టంచుఁ
దేటతెల్లముగను•దెలియంగ నయ్యె న,హింసఁబోలుధర్మ•మెందుఁ గలదె. 167.

క. పదపడి యయ్యంచను బూ,ర్వదశకుఁ దాఁ దెచ్చి దివికి•వదలిన నది స
మ్మద మందుచుఁ జనె నాతఁడు,సదయత నొనరించు•నిట్టిసత్కృతు లెపుడున్.

వ. ఇట్లు సకలపౌరస్తూయమానుం డగుచు నాసర్వార్థసిద్ధుండు, సమానశీలవయస్కు
లగుబాలురతోఁ గూడికొని క్రమక్రమంబుగ వృద్ధిఁ జెందుచున్నంత. 169.

సీ. ఆజానులంబంబు•లై కరంబులు గాలె,వక్షంబు తులితక•వాట మయ్యెఁ
గంఠోయి కర్ణాంత•కమనీయకమ్మయ్యె,నారవం బబ్దగం•భీర మయ్యె
బలము సింగముతోడి•తులనకెక్కు వయయ్యె,ధైర్యంబు మదిలోనఁ•దా వొనర్చె
మెంగము శ్మశ్రుల మయి•ముద్దుఁ జూపఁగసాగె,ఫాలంబు మిగులవి•శాల మయ్యె.

గీ. దేహమున నొక్కలవణిమ•దీటుకొనియె, జంఘలకుఁ జాటవంబువి•స్తార మయ్యె
నతులసుగుణాబ్ధి యైనసి•ద్ధార్థునకును, నిండుజవ్వన మది మేన•నిండునంత. 170.

వ. ఇట్లు సంపూర్ణయౌవనుం డగుచు నాకుమారుండు సంసారదూరం బగువిచారం
బునఁ బ్రవర్తించు చున్నంత. 171.

క. ఋతువులకు రాజు తతదు,ర్గతులకు ధనికులకు నొక్క•గతి సౌఖ్యమ్ముల్
జతకూర్చుజాణ కుంజవ,నతులయదృష్టం బొదవె వ•సంతం బంతన్. 172.

సీ. పండుటాకుల నూడ్చి•పాదపంబులు నాఁడు, నాఁటికిఁ జవురుల•దీటుకొనియె
నిగనిగ నెగడెడి•చిగురులలోనుండి, పసరుమొగ్గలు సము•త్పత్తిఁ జెందె
నామొగ్గ లంతలో•నతిశయించుచు నొకిం,చుక సౌరభమ్మును•జాఱగొనియె
నంతలో నరవిచ్చి•యవి పూవులై సమ,గ్రపరీమళంబునఁ•గ్రాలఁదొడఁగె.

గీ. బడపడి రజఃప్రసంగంబు• పరిఢవిల్లె, నంతఁ దుమ్మెదల్ద్రిమ్మరిం•ద్రావరించె
మలయవాయువు లామీఁద•నలముకొనియె, నెల్లదెసల సుగంధంబు•వెల్లివిరిసె.

గీ. పట్టనముకన్నఁ బల్లెయుఁ•బల్లెకంటె, నుపవనంబును మఱియున•య్యుపవనంబు
కంటెవనమును మేటిసౌ•ఖ్యంబుఁగూర్పఁ, గలవి యైయొప్పెనామని•బలియుకాలఁది.

చ. నదులతలంబులం దుపవ•నంబులచాయలయందు దీర్ఘికా
వదనములందు వారినిధి•పజ్జలఁ గట్టినమేడలందుఁ ద
త్తదుచితకార్యభారములఁ • దద్దయు లోఁగినవారు సంజ పెం
పొదవినవేళల న్ముదము • లుప్పతిల న్నివసింతు రొప్పుగన్. 175.

ఉ. ఎల్లెడ వృక్షజాతముల•యే పుననో సగసప్రచార మై
చల్లనిగాలి వీచుటనొ•మట్టదకోకిలకీరశారికల్
క్రొల్లలుగాఁగ శ్రావ్యగతిఁ•గూయుటనో మఱి యేమొ తద్వసం
తోల్లసనంబు సంజలన•యున్నత మై కనుపట్టు నెంతయున్. 176.

సీ. లతలన్నియును బుష్ప•వతులై నగంబుల, నంచితంబుగఁ గౌఁగి•లించుకొనియె
మందంబులై మంచి•గందంపుఁదావితోఁ, జెలరేఁగి ననుగాడ్పు•లలముకొనియె
దోరముగ్గినపండ్లు•త్రోటిచేఁ గొఱుకుచుఁ, గొదమచిల్కలదండు•కూయఁదొడఁగెఁ
బండుటాకులమీఁదఁ•బడినపూవులజాలు, పండువెన్నెలకంటెఁ•బండు వయ్యె

గీ. నాలుమగ లెల్లఁ దెల్లని•పూలఁజాల, లీల లాడవఁగ జేయునీ•రాలలోన
నించువిల్కాని [illegible] చుకొనుచు, సంతసింపఁగఁ బొగి•రా వసంతుయమంతు.

క. పొగడలుఁ దమాలములు పొ,దుగులుం దిలకాగములు మధూకంబులుఁ గెం
జిగురుంబూవులతోడ, న్నగముల నింపుం దనర్చె నయనంబులకున్. 178

సీ. అరయరక్తాశోకకరయుఁ బలాశాంఘ్రి,కయును నీలాశోకకచయు నీల
నీరజనయనయుఁ వారిజవదనయుఁ,గుందద్విజయుఁ బిల్వకుచయు మంజ
రీకర్ణయును జపాశ్రీకాధరయు సిప,వసనాన్వితయు సింధువారనఖయుఁ
గోకిలాలాపయుఁ గేకికలాపయు సారసస్వననూపురారవయును.

గీ. రమ్యవాసంతికాబద్ధరశనయు మద,హంసగమనయుఁ బుత్రజీవాభిధాన
లోమలతయును నగుచు నెంతే ముదంబు, నరసులకు నెల్లఁ గూర్చె వసంతలక్ష్మి.

చ. క్రమముగ శైత్యబాధ తొలఁగం బ్రజలందఱు మిద్దెమూలలం
బ్రమదలతోఁ బరుంట దిగఁద్రావియు మీఁదివిలాససౌధకు
ట్టిమముల లేఁతగాడ్పులపెండెండము లూరఁగ సన్నసన్న వ
స్త్రములను గప్పుకొంచు నిదురం గొనసాగిరి వేసఁబోకలన్. 180.

మ. మలయాగంబునఁ జందనాగముల సంపర్కంబునం బుట్టి సం
చలదూర్మిప్రకరంబులై కమలసంసక్తంబులై యొప్పు వా
గుల నయ్యైయెడ సేదఁ దీర్చుకొనుచుం గుంజమ్ములం దూఱుచుం
గలయం బ్రాముడిదోషంగె వెన్నెలలసఖ్యంబొందినన్దెమ్మెరల్. 181.

గీ. సదృశనుగు వేఁడిసదృశనూచలియుఁ గలిగి, పవలునిశియును విషమభావంబుఁ గనక
త్రాసునం దూఁగుగతి సమత్వంబు దాల్చి, తనరుచున్నట్టి యవ్వసంతంబునందు.

వ. శుద్ధోదనుం డవ్వసంతర్తువిశేషంబులం జూపి కుమారునిమనంబు సంసారసక్తం
బుగఁ జేయఁ దలంచి రాజమార్గంబు సర్వంబు పంగ్వంధవికలాంగబధిరరహితంబు
గావింపించి కుమారుం గాంచి తండ్రీ యీవసంతర్తువు మిగులఁ జక్కనిది దీనం
గలవిశేషంబు లాశ్చర్యజనకంబులు గావున నీ వొకసారి యీసమీపహిమాచలో
పాంతంబుల కరిగి చూడు మని శిరంబు మూర్కొని మఱియు ని ట్లనియె.

గీ. తండ్రి నిన్నుఁ బాసి గడెయైనఁ దాళఁజాల, వేగ రావలె నంచుఁ దెప్పింపఁబనిచెఁ
గింకిణీమేఖలాసమాకీర్ణమగుచుఁ, గలితశృంగారమైన బంగారుతేరు. 184.

సీ. కమనీయతపనీయకలితసూత్రంబులై, వరుసఁ బూంచినవారువములతోడఁ
బరిమళస్థవమానపవమానపోతమై, చుట్టుఁ గట్టిన పూలకట్టుతోడఁ

గాంగేయపరిధానకంబై విరాజిల్లు, నవపంటి సింహాసనంబుతోడఁ
జిలుగుముత్తియములు చేర్చినచేర్లఁ గట్టి వి, స్తృతము చేసిన వితానంబుతోడ
గీ. వెలయు నొక్కరథంబుఁ దెప్పించి సాది, దేవదేవ పరాకంచుఁ దెలుపఁ దెలుప
జనకునకు మ్రొక్కి యారాజతనయుఁ డేగె, నంత మిత్రులతోడ వాహ్యాళికిఁ జను.
క. తారాగణంబుతోడం, దారానాథుండు మింటఁ దగలు విధము గా
నారాజసుతుఁడు మిత్రుల,తో రాజపథాంతరమునఁ దోతెంచె వెసన్. 186.
క. సిరికొమరునిజిగి జేజే, నాకొమరునిచెలువు రెక్కఁదొక చెలువంబున్
దొరయు తమదొరకుమారుని, నరయుంగా నేగుదెంచి యందఱు కాంతల్. 187.
మ. తవులం జాఱిన కేశపాశ మొకచేతం దాల్చి డాకేల గ
త్యవరోధం బొనరించు కాంచిగ లల్లల్లార్చుచు న్వచ్చి యం
దవనీనాథకుమారు నొక్కసతి జాలాంతఃప్రవిష్టాస్యయై
యవలోకించెఁ గరంబు సాచి నిజకన్యాపాళికిం జూపుచున్. 188.
సీ. ఒడిఁ గ్రాలుపసిబాలు విడిచి యొక్కఁడుగన, వచ్చి భూపతిఁ జూచె వనిత యొకతె
మొలనూలి పైఁడిమువ్వలు జాఱు లైనఁ జూ, డక వచ్చి విభుఁ గాంచె నకియ యొకతె
పతి నియోగించునానతి యైన జవదాఁటి, పోయి రాజుం గాంచెఁ బోఁటి యొకతె
తననిశానైపథ్యమును మార్చుకొనుటయు, మఱచి ఱేనిం గాంచె మగువ యొకతె
గీ. యత్తగా రొక్కదిక్కునకరయఁ బోవ, నామె కను నసుభయ మెదహత్తుకొనఁగఁ
దాను వేఱొకదెసకేగి ధారుణీంద్ర, తనయుఁ దతనయుఁ గోడఁ గాంచెఁ దన్వి యొకతె.
ఉ. గోడలు మేడలుం గుడులు గోపురము ల్మొదలైన వెక్కి యా
చేడియ లెల్ల రిట్లు తమచిత్తము లేలికమీఁద వ్రాలఁగాఁ
జూడఁ దొడంగి రయ్యనఘుఁ జూచినజారిణి యైన నెమ్మదిం
బాడి దొరంగి విక్రియకుఁ బాలొనరింప దదేమహత్త్వమో. 190.
క. పరిణయ మొనరింపం దగు, తరుణవయోధామ లైన తమతనయల కుం
దఱి నిడుకొని కొందఱు చెలు, లగిరి భూవరకుమారుఁ డరయు నటంచున్.
మ. కమనీయాకృతి యైనపుత్రకుని సౌఖ్యంబుం గనుంగొంగ న
య్యమకుం దుల్యధరాత్మజారమకు మాయాదేవికిం గొంతకా
లము దీర్ఘాయువుఁ బొసంగఁ డాయెఁ దనకేలాభంబు చండాలమై
వ మటంచుం జరతీనికాయ మొకక్రేవం జూచె శాపోవుచున్. 192.

క. జాలాంతర్గత లగు వా్యాలోలాక్షుల మొగము లెల్ల లోలభ్రమరీ
లీలాకసరసీభవ్యమ్మాల్య సౌందర్యమంజిమంబు వహించెన్. 193.

వ. ఇట్లు సకలపౌరజనవిలోచననిపీయమానుం డగుచుఁ బుణ్యాంగనలు సేసలు చల్ల వృద్ధ బ్రాహ్మణు లాశీర్వదింప నిరుదెస వందిమాగధులు కైవారంబులు చదువ సాదిజన సంచార్యమాణంబు లగునుత్తమాశ్వంబులు ముందు నడువ రమణీయతరం బగురా జమార్గంబు గడచి చనుచున్న సమయంబున. 194.

సీ. అతితీకాయలుగాయ నవనిదున్నుచుఁ గష్టపడుచుండు కాసరద్వయము నొకటఁ
జెన్నుగా దున్నిన చేలలో విత్తులు వైచుచుండెడు కాఁపువాండ్ర నొకట
ఫలపుష్పవితతులఁ దులఁదూఁగి నేలకు నంటుచున్నట్టి వృక్షాళి నొకట
వానిఫలమ్ములఁ భక్షించి సుఖియించు గీరాదికపతత్రివార మొకటఁ

గీ. బట్టి చీమల మ్రింగెడు బల్లిని మఱి, దాని మ్రింగెడు పాము నద్దాని మ్రింగు
వైనతేయుని జిన్నచేఁపలను మ్రింగు, పెద్దచేఁపలఁ దినుపక్షిబృంద మొకట.

గీ. వాని బట్టి భక్షించెడి శ్యేనములను, నొకట వే ఱొక్కయెడ మనుష్యులనుఁదిను న
ఘోరులను జూచి యొక్కింత కుతుకమును మ, తింతసంతాపమును జెంది నృపసుతుండు

చ. తనమనమందు నెన్నియొ విధంబుల నెంచుచుఁ దండ్రి చూపఁ బం
చిన వివియొక్కొ యిచ్చటి విశేషము లం చొకయింత నిల్చి లోఁ
గని యొకఁ డన్యజీవమును గ్రాసముగాఁ గొను టెల్లభంగి హిం
పను నెగడించుచున్న దిది సైఁచితి నే దయగల్గువాఁడనే! 197.

వ. అని చింతించుచుఁ గొండొకనేల పోయి ముందు నడచినను నిట్టిదుర్ణయంబులె కన్పట్టు ననుభయంబునం గుందుచు జగం బంతయు హింసాప్రచారం బగుటకు విచారించుచుఁ దత్రత్యం బగు నొక్క నేరేడుచెట్టుక్రిందఁ గూర్చుండి మిత్రులు పిలిచినను బలుకక ధ్యాననిశ్చలుం డై యుండు నెడ. 198.

ఉ. ఉప్పరవీథి నేగు రమణోత్తము లేగుచుఁ బుష్పకంబు దా
నెప్పటియట్ల నయ్యెడల నేగమి కించుక శంకనంది చూ
పప్పరుషాధ్యుఁ డున్న భువియందు నిగుడ్చుచు నున్నయంతలో
నిప్పలుకు ల్వినంబడియె నేరును జెప్పక యే దివంబునన్. 199.

క. ఈతఁడు పరసంరక్షణ, కై తా జన్మంబు నెత్తినట్టిఁడు సుగుణా
న్వితుఁడు మహానుభావుఁడు, చేతమ్మునఁ గరుణఁ దక్కఁ జేర్పఁ డితరమున్.

# ప్రథమాశ్వాసము.

వ. అను నంబరవాణిపల్కు లాలించి వారలా సర్వార్థసిద్ధునకు కచ్చటి నుండియు నమ
స్కరించి తమయిచ్చం జనిరి పిదప నితం డయ్యోధ రాజ్యాలంబుల
కుండుటయు.

క. జంబూవృక్షము రవికిరణంబులు పయి సోకకుండ • నరనా[illegible]
జుం బేర్మిc గాచుచుండె సుఖంబులు తమయంతc గల్గc • గా జ్ఞానులకున్. 202.

శా. ధ్యానైకాగ్రమనస్కుc డై నృపసుతుం • డట్లుండcగాc దక్కుభృ
త్యానీకం బొకయింత లేప దివి తా • నవ్వారితో నిట్లనున్
వీని న్లేపcగcబోకుc డీతcడు మహా • వేత్పత్వఘుర్యుండు తా
నే నేమం బగునంత లేచు నన నా • భృత్యు ల్భయభ్రాంతులై. 203.

క. జననాధసుతుని లేపక, కనుcగొనుచుండంగ నతcడు • కమలాప్తుcడు గ్రుం
కినతోడన ధ్యానసమా, ప్తిని జేసి పురంబునకును • విచ్చేసె సొగిన్. 204.

## ఆశ్వాసాంతపద్యములు.

క. ఆంధ్రకవిత్వాదర నీ, రంధ్రయశోవిజిత రాజ • రజతధరశర
త్కాంధ్రనరసింభవభవ పు, రంధ్రీహిరేశ కృష్ణ • రాయమహీశా. 205.

మ. కవితాలోలమతీ వికస్వరకృతీ • కల్యాణభూభృత్పతీ
యవిగీతప్రకృతీ మనోహరగతీ • యాంధ్రాభిధత్క్ష్మాచల
త్పవిహస్తానుకృతీ ధరావిబుధవి • ద్వన్నుత్యనితోన్నతీ
యవనీమండన కృష్ణరాయవసుధా • ధ్యక్షాకృతి శ్రీపతీ. 206.

## మాలిని.

సరసతరవిహారా • సాధుచేతోబ్జసూరా
కరవిలసితధీరా • కామమూంబాకుమారా
తరుణవయఉదారా • ధర్మ్యగోదాతటీరా
జ్యరమణధృతభారా • జాగరూకప్రచారా, 207.

## గద్యము.

ఇది శ్రీ...తిరుపతివేంకటేశ్వరప్రణీతం బగుబుద్ధచరిత్రం బనుమహా
ప్రబంధంబునందుం బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

తిరుపతివేంకటీయము.

# బుద్ధచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

క. నిటలాక్షచరణసేవా, ఘటనాదర సత్యవాక్య • కల్పక గోదా
తటనికటరాజ్య శ్రీవేం,కటకృష్ణారాయ విబుధ • కవిజనగేయా ! 1.

గీ. అవధరింపు మనంతరం•బవనిపాల, కాత్మజాతున కష్టాద • శాబ్దములవ
యన్న నింతటయును దండ్రి•యయ్యవసర, మునకు ననుగుణ మైనరీ•తి నెదనెంచి.

గీ. శీతునకు వేసవికిని వ•ర్షించుకాల, మునకు నుచితంబు లైసుఖం•బును ఘటించు
శుభ సురమ రామ యను పేర్ల•సౌంపు నింపు, మాడువులఁ గట్టఁబనిచె నా•త్మజునికొఱకు.

శా. ఆసౌధమ్ముల చుట్టుఁ దోఁటలును వా•ర్యంత్రంబులుం గాల్వలు
న్నావాసార్హమ్ములు చప్పరమ్ములును గో•పమ్ము ల్తటాకమ్ము లెం
తే సొంపొప్పఁగఁ గూర్పఁజేసి మఱి యా•స్నేలోఁగిళు ల్గట్టఁగాఁ
జేసెం దత్ప్రతిసౌధరాజమునఁ బ•ల్చిత్రావళు ల్వ్రాప్పడన్ 4.

గీ. గడియ కొకరీతిఁ గ్రీడలఁ• గైకొనంగఁ, దగుగతిని సౌధముల నిట్లు•తండ్రి కట్టఁ
జేసి కొమరుని నందు ని•వాసము నకుఁబను పుటయు నాతఁ డాయిభ•వనములందు.

ఉ. వాసము సల్పుచు న్విమల•వాఁకలితంబు పరోవరంబు మ
త్స్యసరణిం గలంచు నటు•లెంతయు మానసము న్విచారము
గ్లాసిలఁజేయ నెయ్యెడ వి•కాసము దక్కినవాఁడు వోలెఁ దా
నే సుఖముం గ్రహింపమికి•వచ్చినదుఃఖమున న్విభుం డొగిన్. 6.

వ. రాజకార్యవిశారదు లగుమంత్రులం బిలిచి కొమరుని విషయపరాఙ్ముఖత్వంబు వారల కెఱింగించి దీనికిం దగినకట్టడలు గఱపఁ గలుగు నుపాయంబును మఱువుఁ డని మఱియు నిట్లనియె. 7.

గీ. స్వప్నఫలము వచించు న•వ్వట్టునందుఁ, బండితులు రెండురీతులఁ•బలికి రందు
మత్సుతుమనంబు రెండవ•మార్గమందు, వడచుచున్న దిఁ కేమియొ•నర్చువాఁడ. 8.

వ. కావున రాజ్యపాలనాదివ్యాపారంబునం దీక్షనిమనంబు మరగునట్లు చేయుఁ డనిన
వృద్ధమంత్రి యొకం డిట్లనియె. 9.

మ. మదిరాక్షీపరిరంభము ల్మఱియు నమ్మానిన్యపాంగంబులున్
హృదయంబు ల్కరఁగించు నేరికిని మత్తేభేంద్రకుంభస్తను
ల్గదియన్ ధ్యానము జ్ఞానము న్నిలుచునే కాంతాశిరోజంబున
న్బదము ల్గట్టఁగవచ్చు సంకెలలకుం బద్ధుండు గాఁడే నియున్. 10.

శా. హేలావత్యధరామృతంపుఁజవి యింతే నీతని న్సోఁక వే
ఱేలా యయ్యది మిమ్ము మ మ్మితర మెప్డేనిన్ స్మృతిం జొన్పనీ
కాలావణ్యరసామృతమ్మున నిమగ్నాత్ముం బొనర్చు న్నృపా
హాలాపానము గాదె స్త్రీసుఖము వేఱం దెందుఁ గన్పట్టునే. 11.

ఉ. మాయలమాటలు న్నగలు మంచితనమ్ములు టక్కులు న్హాయ
ల్పాయక యిల్లు గట్టుకొని పాపముఁ బుణ్య మెఱుంగనీక నా
పాయములై సతీమణులు బంటుగఁ బూరుషుఁ జేయుఁ గావునన్
వేయును నేల పుత్రునకుఁ బెండ్లి యొనర్పుము సత్వరంబుగన్. 12.

వ. అని వెండియు. 13.

చ. ఒకనికి నింపు గానిసతి యొక్కనికన్నుల కందగత్తె వే
ఱొకనికి రంభయే మఱియు నొక్కనికిం గొఱగాకయుండు దీ
నికి మదియే ప్రధాన మది నీ కొకఁ డన్యులకొక్కఁ డింత యే
టికి మన మెంత యేరిచి ఘటించిన నయ్యది వేఱుతీ రగున్. 14.

క. అది గాన నితనిమన మ్మేమదిరేక్షణయందుఁ దవిలి మరుగునొ మననె
మ్మదికిం దెలియదు దానికి, నిది యొక్కయుపాయ మదియు నెఱిఁగింతు నృపా.

క. అగుఁగాదె శాక్యులకుఁ బం,డుగు మన మానాఁడు తగుపఁడుచుఁగన్నెల పో
యగపుగవల రప్పింపం,దగు బహుమానముల నొసఁగి దమ మనెపమునన్. 16.

మ. ధనమం దిచ్చునుగాని యుత్సవపుసందర్భమ్ము వీక్షించు కో
ర్కినిగానీ నృపునాజ్ఞ యేగతి నివారింపంగ నౌ నంచుఁ ద
ప్పనియిక్కట్టునఁ గాని వత్తురు కనత్పద్మేక్షణల్ చాకచ
క్యనిరూఢిం దగు దాని నందొకసతిం గామించు నీపుత్రుఁడున్. 17.

వ. ఇట్లు కామించినక్షనక్కన్యాజనకుండును దనకొమరితె నీకుమారున కిచ్చి పరిణయం బొనర్చు నిట్టిదంపతుల దాంపత్యంబున కెన్నండును నెడ గలుగ దని మఱియు ని ట్లనియె. 18

క. చక్షురద్విపరీతం బగు,క్షితి యెల్లను నేలు నృపతి•శేఖరునకు నీ యంకునకు సుత నీ నెంచని, మతిహీనులు గలరె శాక్య•మనుజాధీశా. 19

క. అన రాజీకొని చాటిం,చినఁ గన్నెలు మిగులఁ జెన్ను•చెన్నారెడిభా గ్యనిధులు తన్నగరంబున,కును వచ్చిరి వేలకొలఁది•కుతుకం బలరన్. 20.

వ. పదపడి శుద్ధోదనుండును దత్కన్యాజనంబునకు బహుమతు లిచ్చుచుఁ దగినకన్యను వరియింపు మనియుఁ గన్యాస్వయంవరంబున కై యిది యొక్కయుపాయంబు ఘటించితి ననియుఁ జెప్పి కుమారుం దోడ్కొనివచ్చుట కై యతని కాబాల్య మిత్రం బగుపురోహితనందను బనిచిన వాఁడును సంసారంబు కష్టబహుళం బనియు యౌవనంబు జరాదూషితం బనియు మృత్యువనివార్యం బనియు వ్యాధు లనుభవనీయంబు లనియు విచారించుచుఁ బరిణయేచ్ఛం దిగఁద్రావి సన్యసనో న్ముఖం బగుమనంబున నున్నత్తునిపగిది జడునిరీతి నున్న సర్వార్థసిద్ధు నొద్దకుం జని.

క. హితమార్గము గఱపుటయు న,హితమార్గమునందు నడువ•నీకుంటయు దు ష్థితి గతియును దుర్వ్యసనా, వృతియును మరలించుటయు సు•హృల్లక్షణముల్.

వ. కావున నీయెడం గలుగుచనవునం జేసి నీకొక విన్నపంబు విన్నవింపఁగ వచ్చితి భవదీయపరిణయంబునకై యొకనెపంబున సకలదేశతరుణులఁ బిలిపించి యొక పండుగఁ గావింపనుండి వారికిం దగిన బహుమతులు నీచే నిప్పింపవలయు నని నిన్ను రమ్మనియెఁగావున నీతండ్రిమాట వృథసేయక వచ్చి యక్కన్నియలయందు భవదీయమనోగతంబునకుం దగినదాని నెక్కతెం బరిణయంబు గమ్మనిన నతండు నవినయమ్ముగా నప్పురోహితనూతి కిట్లనియె. 23.

క. పరిణయ మెల్లక నే న,స్థిరమగుసంసార మనెడు•తెరువునఁ బడ కాం తర మగుతత్త్వజ్ఞానాం, తరమునఁ జరియింతు నన న•తం డి ట్లనియెన్. 24.

క. తరుణవయస్కుండవు సుం,దరుఁడవు నృపపుత్రకుఁడవు•తగువాఁడవు ధీ వరుఁడవు వంశము నెగడన్, బరిణయ మొనరించుకొనుట•పాడి కుమారా. 25.

క. కామము పురుషార్థంబుల, లోమహనీయంబు దాని•లోపల గృహినెం దేమన్నింతురు గావున, నామాటలు వినుమ రాజ•నయమ్మునం గనుమా. 26.

క. పరతత్త్వాదరమగుమదిఁ, దిరముగఁ దొంటిమునులు • ధీమంతులు న
స్థిరమనియెఱిఁగియు భార్యా, పరిగ్రహము మానరే త • పంబులు చెడునే. 27.

చ. కొడుకులఁ గొమ్మలం బడసి • కొండొకకాలము ధాత్రిఁ బేలి మే
ల్నడవడిఁ జేసి మీకుల మ • లంకృతముం బొనరించి తండ్రికిం
గడుముద మేధఁజేయవలెఁ • గాని నరేంద్రులు చేయరాని యీ
వెడఁగుఁదనంబుఁ బూనఁ దగ • వే భగవంతుఁడు నైన మెచ్చునే. 28.

చ. అదియునుగాక కామపురు • షార్థము దెచ్చు నుపద్రవంబులం
జదువులు సంధ్యలు న్నిలువఁ • జాలవు రేఁబవ లేండ్లకేఁడులు
న్నిదురయు నాకువంటకము • నేనియు మానిన వారి కైనను
న్జెదరక నిల్చునే తపము • నిష్ఠలు గిష్ఠలు స్త్రీలముందఱన్. 29.

క. ఒకనాఁడు విరాగము పా, యక వర్తించినను దత్ప • దాంతరమున నే
సకల సుగుణంబులకు మా, రక మగుమది దాని నమ్మ • రాదు కుమారా. 30.

సీ. జడదారిసకితోడ • జతగూడె వేవేలు, వెలఁదులు గలవాఁడు • వేల్పుఱేఁడు
జాబిల్లిపడఁతితో • సరసంబుఁ గావించెఁ, దపసి లోపాముద్ర • ధర్మభర్త
దైవతగురునికాం • తాలలామముతోడఁ, గవగూడె శిష్యుఁడై • కలువఱేఁడు
ఔతథ్యఋషిపత్ని • యగుమరుత్పుత్రితో, సావాస మొనరించె • దేవగురుఁడు
గీ. దాశపుత్రికతోడఁ బ • రాశరుండు, పట్టపవలు నదీతటీ • భాగమందుఁ
దగులుగావించెనిన్ని విం • తలును దలఁపఁ, గామమును గెల్చువారు లో • కమునఁ గలరె.

వ. మఱియు మునివరిష్ఠుం డగువసిష్ఠుం డక్షమాల యనుమాతంగకన్యకయందుఁ
గపింజలాదుం డను కుమారుం గనియె. యయాతియనురాజర్షి ముదుసలి యైనపిద
పను విశ్వాచి యను నచ్చరమచ్చెకంటితోఁ జైత్రరథంబునం గ్రీడించెఁ గౌర
వుం డగుపాండురాజు మృత్యువు నైనఁ దలంపక మాద్రీసాంగత్యంబున కొడం
బడియెఁ, జిరకాలోపార్జితం బగుతపంబు భగ్నం బగుననియైనఁ దలంపక విశ్వా
మిత్రుండు మేనకా మధురాధరంబు చవిచూచెఁ, గరాలజనకుం డనువాఁ డొకవి
ప్రకన్యక నపహరించి చావునకైన నంగీకరించెఁ గాని దానివదలుట కొడఁబడఁ
డయ్యె, నిట్లనేకు లనేకప్రకారంబులం గామపురుషార్థంబునకు లోపడినవారు
కలరు; వేయేల యనుభూతకాంతాసంగమసుఖాతిశయు లగువారి కేనియు నిట్టి

ప్రమాదంబులు గలుగుచుండ ననుభూతవిషయోపభోగు లగునీవంటి తరుణ
విరాగుల కది యడుగవలయునే యనుమిత్రుని జూచి పరకృతజన్మసంసిద్ధార్థుం
డగుసర్వార్థసిద్ధుం డిట్లనియె. 32.

గీ. మైత్రికిం దగుగతి నయ•మధుర మైన, సదుపదేశంబు నాకయి•సలిపి తీవు
తప్పులన్నియుఁ జైరించి•దయ దలంచి, మదికి నచ్చించి నా చేయు•మనవి వినుము. 33.

గీ. ఏను విషయసుఖంబుల•నెఱుఁగఁగాని, యెఱుఁగుదు విషయసుఖముల•నెఱుఁగువారి
జగ మనిత్య మటన్నసం•శయముకతనఁ, దత్సుఖంబుల నామది•తగుల దనఘ. 34.

చ. ముదిమియుఁ జావు రోగమను•మూఁడును బ్రాణుల కుండవేని యీ
ముదితల కెల్ల జవ్వనము•ముందును నీగతి నుండునేనిఁ గ
ష్టదశలు మాటిమాటికిని•సంసరణంబున మూఁడవేని నా
మదికిని నచ్చవే విషయ•మార్గపుసౌఖ్యము లెల్ల నెచ్చెలీ. 35.

క. నీనుడివినవా రెట్టిరు, కానీ కామాంధులనియ•గణుతింపఁదగుఁజా
మానసము విషయమగ్నం, బైనమహత్త్వంబు నిలుచు•నా చెలికాఁడా. 36.

గీ. పద్మదళమున జలముండు•పగిదిఁ గూట, మంటి యంటనివిధమున•నుంటమేలు
గా గణింతురు గాని యా•కామినులను, మోసపుచ్చుటకాదె యా•మోడు చెలిమి.

క. కావున ముదిమియుఁ జెవులుం, జావును గలయట్టిపాడు•సంసారములో
నావంటివానిఁ ద్రోయుట, కై విజ్ఞానంపుఁదెరువుఁ•గడ తేర్పకుమీ. 38.

వ. అనుచు ననేకప్రకారంబుల సంసారనిరాకారం బొనరించు కుమారుం గని పురోహిత
నందనుండు తిరోహితతదుపదేశుండై మరల నిట్లనియె. 39.

చ. జనకునికోరికన్ వృథగఁ•జల్పకు మయ్య వివాహ మీవు మా
నినను భవన్మిషంబున నే•నేకనరేంద్రకుమారికాచయం
బు నగరి కేగుదెరఁగఁ బ్ర•భుండు నియోగము సేసెఁ గావున
న్జని తగవారికిం బసద•నంబు లొసంగఁగదయ్య మిత్రమా. 40.

క. కొడుకులు కొడుకు లటంచుం, గడుకొను పెనువంతఁ దపము•గావించి తుదిం
బడసిన కొడుకులు తండ్రుల, నడలంగాఁజేయు టుచిత•మగునె కుమారా. 41.

ఉ. ఈవు విరాగివైతివని•యే మదిఁ గుందుచు నన్నపానము
ల్వోవిడియున్న నీపిత క•పూర్వములైనభవత్ప్రసంగము

శ్నే వినిపింతు నేని నళినిజ్వలితం బగుకొండపాడ్కిఁ జిం
తావశచిత్తుఁడై మడియుటబ్బురమా పృథివీంద్ర పుత్రకా. 42.

క. కావున నేనుడివినగతి, గావచ్చి నరేంద్రకన్యకలకు బహుమా
ల్గావింపుము నావిన్నప, మావలకుం ద్రోయవలదయ్య నరేంద్రా. 43.

వ. అనుచు ననేకైతిహాసికగాథలు బోధించియు గారవించియు నెట్టకేల కురరీకా
రంబు గావించి నృపకుమారుం దోడ్కొనివచ్చి యేకతంపుంగొల్వుకూటంబున నం
దగినపరివారంబుతో ధనకనకరత్నచీనిచీనాంబరశ్రేణి యిరుదెసలంగల యొక్క
పటుపుగద్దియపై వసియింపంజేసె నంత. 44.

ఉ. చేరెడు కన్నులుం దళుకుఁజెక్కులుఁ గుల్కు పిసాళిగుబ్బ ల
బ్జారిని గేరుమోము కనదంఘ్రులు వింతగుచాయ నీనశృం
గారరసంపు దీవియనఁగా నొక కన్నియ వచ్చెఁ దత్సభా
స్తారులు తేఱిచూడఁగ మితస్థితిభూషణభూషితాంగి యై. 45.

మ. చలువంజేసిన మంచుకన్నను గడున్ స్వచ్ఛంపు మేల్ముస్గుఁజెం
గులు పాదమ్ముల జీరువాఱునను నిగ్గుల్దేఱు నెమ్మోము వ
న్నెలు మై చిన్నెలు శారదాంబుదతతిన్నిర్లీనమై యొప్పు వె
న్నెలనాఁ గొండొకదోఁప నొక్కచెలి తన్నే చూడఁజొచ్చె న్సభన్. 46.

చ. గరగర లాడుగాగర ధగద్ధగితప్రభ లీన మేజ్జరీ
హరు వలరారు రైకయొకయందముఁ జూపఁగ సన్నమైన బం
గరుపనిపైఁట యొక్క డగుకాంతి నెసంగ మణీవిభూషణో
త్కరమయ యై సభాస్థలికిఁ గన్నియ యొక్కతె వచ్చె నచ్చుగన్. 47.

మ. అధరం బొక్కటిసేయు నెంతకయినన్ హావేణి సౌరద్దిరే
మధురం బాగమనంబు మేనివపకున్ మాఱౌనె బంగారు మే
ల్కుధరంబుల్గదలించుగుబ్బ లనికోర్కుల్ మిన్ను ముట్టంగఁ ద
న్మధరాపాలసభాసదు ల్దమినిఁ గన్గొ నొర్తు వచ్చెన్ వెసన్. 48.

సీ. కడియంబు లందెలు గజ్జెగొల్సులు గూడి, యడుగడుగున గల్లురంచు మ్రోయ
జీరాడు మేజ్జరీ చెఱఁగుఁ గుచ్చెళ్ల చ, క్కఁదనంబు మీఁగాళ్ల కడల రాయ
మడఁచి యొడ్డాణంబు మధ్యఁ జేర్చినపైఁట, యంచు తెమ్మెరలం దూఁగాడఁజేయఁ
గబరీభరంబుపైఁ గడలుకొల్పిన పూవు, లదరిఁ తావులకుఁ దుమ్మెదలు తోయ

గీ. విడెముతో వియురదనచ్ఛవి యనుగలసి, యోష్ఠకాంతికిఁ గొంతచే యూఁత యొసఁగఁ
జూపు తెల్లదనం బదన సోగకనుల చూడ్కిఁ, గరిగమన యోర్తు వచ్చె నక్కజముతోడ.

గీ. మోహమున నిల్పు రాసుతు మంతునన్న, పగిది నొకబోడ్డుమల్లెఁగ బరిధరించి
చెలువు మించెడు వల్లని చీరఁగట్టి, తెలివసారసగమన యేతెంచె నొకతె. 50.

ఉ. సన్నగఁ జెక్కుటద్దముల నూల్కొన దువ్విన కాకపక్షము
ల్సన్నని వంకగా నుదుటఁ జందన మద్దినచంద్రరేఖయుం
జెన్నువహింప ముత్యములఁ జేరుశిరంబునఁ దాల్చి వేడుకం
గన్నె యొకర్తు వచ్చెఁ గనకప్రభ మేనఁ దురంగలింపఁగన్. 51.

క. కస్తీ చేసినగతి నతి, శస్తమ్ముగ మేనిపస పసందుగఁ బైకిం
గస్తూరితావి నింప వ, యస్స్నత యగు నొక్కచందిరానన వచ్చెన్. 52.

మ. నెనరుం జూపులు హారమధ్యమఘనన్నీలాశ్మ రశ్మిచ్ఛటా
ఘనభాస్వజ్జనితాపగం గలసి వేణ్క్యం బైఁటపైఁ బర్వ లీ
లను దాని న్సవరించుకోఁ గదలు కేల్వాయుభ్రమత్తత్రజా
తనలభ్రాంతి యొనర్ప నొక్కరిత యంత న్వచ్చె బల్మెచ్చుగన్. 53.

క. కులుకుచుఁ జూపఱదృష్టికిఁ, దలఁకుచు నృపసుతుని గాంచి తద్దయుఁ దనలో
నులుకుచు నొకకన్నియ వ, న్నెలకుప్ప యనంగ వచ్చి నిలిచెన్ బ్రోలన్. 54

వ. ఇట్లు స్వవయోచితభూషణమ్ములు ధరియించి తత్తద్దేశనరేంద్రకన్యకలు సభామంట
పమ్ము దరియం జొచ్చుటయు నంతకుమున్న శుద్ధోదనుండు వారలకు బహుమానంబు
లొసంగఁ గుమారు నియమించెఁ గావున. 55.

శా. ఆసిద్ధార్థుఁడు తండ్రియానతిని శాంతాకార మేపార మే
లౌ సింహాసనమందు సౌరలర నధ్యాసీనుఁడై వచ్చు క
న్యాసంఘంబులవంకఁ గన్గొనక యేయద్దాని నొక్కొక్కతెం
దా సత్కారము చేయుఁ జీరలును రత్నాల్మున్నగా నిచ్చుచున్. 56.

ఉ. ఆతనియొద్ద కేగి వినయమ్మున భీతకురంగులో యనం
గాతరరీతి సత్కృతులఁ గైకొని వెన్కకు నేగుకన్నెలం
జేతము పల్లవింప నృపు చెంతవసించుజను ల్నతింత్రు గా
నీ తనచిత్తమం దయిన నించుక రాసుతుఁ డెంచఁ డొక్కతెన్. 57.

వ. ఇట్లు తండోపతండంబులుగా వచ్చి కన్నియలు బహుమానమ్ములు గైకొనునెడ. 58.

సీ. భ్రమరసమూహంబు పఱ్ఱఁగట్టినరీతి, జడ మడమదాఁక సాఁగి యాడఁ
బద్మేషుచాపంబుపై మణుల్దాఁచిన, సొరున మేన భూషలు చెలంగ
నిసుముతిన్నియలపై నివము వొల్చినభంగిఁ, గటిసీమఁ బావడ కళలనీనఁ
జక్రమ్ములకు నిత్యసంగతికై యుపాయ మొనర్చె నన రైక యటనెసంగ

గీ. మోమునఁ బతివ్రతాత్వంబు మొలక లెత్త, సభ్యులకు మాతృభావంబు చౌకళింప
ధ్యాననిశ్చలుఁ డైన యతని యెదుటకు, వచ్చి నిల్చె యశోధరా వారిజాక్షి. 59.

ఉ. కన్నియ నంచయాన నవకంజవిలోచనఁ గోమలాంగి న
త్యున్నతపీనవర్తులకుచోజ్జ్వలఁ జంపకగంధి వ్రీడసం
ఛన్నముఖి న్యశోధర లసన్మృదులాధరఁ గాంచె రాసుతుం
డెన్నఁగరాదు గా మతియు నేరికి నేరికి ధాత వ్రాయునో. 60.

వ. ఇట్లు పురాకృతసంస్కారవశంబునం జేసి యక్కన్నియ యందు బద్ధానురాగుం
డగునయ్యెడ. 61.

చ. వెనుకొనులజ్జ లో నడఁచి భీతి యొకింతయు లేక రాజనం
దనునిమనం బెఱింగినవితంబున నందఱికంటె నెక్కుడౌ
చను వెసఁగంగఁ గానుక లొసంగినఁ గైకొని యేగుదాననాఁ
గనతఁ డొకింత లోన నగి కానుక లయ్యెడ లేక యుండుటన్. 62.

మ. వనజాతేక్షణ కానుక ల్మిగిసె నీవామాత్తులం దేరికీ
యని దీకానుక చూచితే యనుచు నయ్యబ్జాక్షితో నెక్కభం
గినిమాటాడుచు నెల్లరుం గనఁగొనం గ్రీవాగతం బైన చ
క్కనిమేల్పచ్చలహార మచ్చెలివలగ్నంబందుఁ జొట్టె న్వెసన్. 63.

ఉ. పచ్చలహారమిట్లు నరపాలసుతుం డవలగ్నసీమపై
నచ్చపలాక్షి కిం బొదవునట్టులు చుట్టిన యంత నామెకున్
హెచ్చె నృపాలసూతి పయి నింతనరాని మనోరథంబు పే
రచ్చెరువంది రందఱు నరాధిపుఁడు న్వని సంతసింపఁగన్. 64.

వ. ఆబాల్యవిజృంభమాణవిరాగచేతస్కుం డగుసర్వార్థసిద్ధుం డక్కన్నియయందు
బద్ధానురాగుం డగుటకుఁ గతం బెట్లం టేని. 65.

మ. యమునాతీరమునందు నొక్కఁడసునం దాభిఖ్యఁ జెన్నారు సొ
క్కమహాశక్తివసించు నాదరిని నక్కానం గనద్దేవదా
రుమహీజంబులనీడఁ గ్రీడలు పొనర్చు న్వైన్యకన్యాజనం
బమలాత్మ్యుం డొక వేఁటకానికొడు కత్యంతంబుఁ దోడైతగన్. 66.

ఉ. వాఁ డొకనాఁడు మేలు గల వస్తువుల న్మతికొన్ని దెచ్చి త
త్క్రీడలవారి తేటివసతీతతికిం బహుమాన మిచ్చుచున్
వేడుక నందు నొక్కయర విందదళేక్షణ కిచ్చి డెంద మ
చ్చేడియఁ బెండ్లిచేసికొని చెల్మియొసంగఁగ నుండి క్రమ్మఱన్. 67.

వ. కొండొక కాలంబు సుఖంబు లనుభవించి తత్సహితమ్ముగఁ గాలమ్మునకు లోపడి కేదారంబున నప్పు డప్పుడెఱుంగక పడినబీజంబులును వానకాలంబున మొలచిన పగిదిఁ బూర్వజన్మార్జిత సుఖదుఃఖంబు లుత్తరజన్మంబున కనుస్యూతంబు లగుటఁ దదనుభవంబున కై సర్వార్థసిద్ధుం డయ్యెఁ దత్సతియుఁ బురాసంభృతాత్యంతసంబంధంబున నిట్లుజనియించె నియ్యది యియ్యిరువురి యన్యోన్యానురాగంబునకుం గతంబు. ఇది యిట్లుండ. 68.

శా. ఆసిద్ధార్థునకు న్యశోధరకు సౌహార్దంబు నన్యోన్య మెం
తే సిదించుట గాంచి కొందఱది పృథ్వీశానుతోఁ దెల్ప నే
మీసిద్ధార్థుఁడు సుప్రబుద్ధునతపై మే లుంచెనే యత్న మి
ద్దే సాఫల్యము చెందె సంతసము వేఱెందింతకుం గల్గునే. 69.

క. శ్రమ మెంతచేసినను సా, ధ్యము గానిపతత్త్రి పట్టఁదగు వలతాన్నై
యమరిన దిఁ కేమి యని మో, దమునన్ శుద్ధోదనుండు తద్దయు మునిఁగెన్. 70.

వ. పిదప నయ్యశోధరతండ్రి యగుసుప్రబుద్ధుండు విదితవృత్తాంతుం డై సార్వభౌముఁ డగుశుద్ధోదనునియొద్ద కిట్లు వార్త నంపించె. 71.

క. మనశాక్యులలో విలువి, ద్యను దక్కినవిద్యలను సమధికప్రజ్ఞన్
దనరెడువానికి మత్కన్య నొసంగెద దేవదత్తుఁ డట్టిఁ డగుఁగదా. 72.

క. విలువిద్య నర్జునునితోఁ, దులఁదూఁగెడు సామునం దగులుఁ డశ్వములన్
మెలఁకువగ నెక్కుఁ బెఱభూ, తలనాథులనుతులు దేవదత్తున కెనయే. 73.

క. కాన నతనికిం గన్యక, నీ వెంచెదఁగాని యన్య మెఱుఁగకె నిత్య
ధ్యానాసక్తుం డగునీ, సూనునకు నొసంగనొల్లఁ జుమ్ము మహాత్మా. 74.

క. అను వార్తను విని శుద్ధో, దనుఁ డేమియుఁ జెప్పలేకుండం గడుఁ జింతం
గొనుటయు సిద్ధార్థుఁడు తన, జనకునికి ట్లనియె ధైర్యసంపన్నుం డై. 75.

క. జనకా మత్ప్రియపుత్రుఁగ నున్న యిక్ష్వాకుల యొరులకడ కరుగునె నా
కును నేర్పు గలదు విద్యల, మనమున ననుమాన మింక మానుము తండ్రీ. 76.

గీ. అనుడు నరపతి సంతోషమంది పిదప, సుప్రబుద్ధుఁడు విద్యలఁ జూడఁ దైన
వాని కిచ్చెద మత్సుతఁ బరగుణాఢ్య, యనుచుఁ జాటించె నెల్లెడ ఘనులు మెచ్చ.

ఉ. అందఱు రాజపుత్రులు స్వయంవరమంటపమందుఁ జేరి రా
ణ్ణందని నిందు విద్యలఁ గనంబడఁజేసి వరింతు మంచు నా
నందముఁ జెందుచుండ జననాథుఁడు యంత్ర మొకండు పన్ని దీ
నిం దగఁ గొట్టి మత్సుత ననింద్యగుణ న్గ్రహియింపఁగావలెన్. 78.

చ. అనవుడు రాజపుత్రులు తదగ్రమున న్నచిత్ప్రయత్ను ల
య్యును నటు చేయలేమిఁ దల లొయ్యన వంచిరి యాతఁ డంత నా
నన మలరంగ సింహహను నామకచాపముఁ గేలఁ బూని య
ల్లన నటికె యంత్రముం దనదు లావు నృపాలకు లెల్ల మెచ్చఁగన్. 79.

వ. పదపడి సుప్రబుద్ధుం డొకవ్రాను నొకవ్రేటునఁ గత్తిచే నఱుకవలయు ననుడు
నరేంద్రు లందఱును యథాపూర్వు లైరి, కొందఱు నటికి రంత. 80.

గీ. అసికరంబునఁ బూని సిద్ధార్థుఁ డితర, కృత్తమాపాదపముకన్న నెక్కు డైన
లావు గల్గినయొకచెట్టు నోవ నేయ, నది తెగియుఁ దగనిపగిది నట్టెయుండె.

చ. అది కని యెల్లవారుఁ దగ దయ్యెది యాతనిచేత నెక్కు డై
పొదలెడి సాము నేర్పుగల పూరుషుఁ డిప్పని సేయనేర్చు నం
చెద ముద మొందుచు న్నిగుల హేళనము ల్పచరింప దేవత
ల్పదపడి తెల్పుచుం గుసుమవర్షము పైఁ గురిపించి రత్తఱిన్. 82.

వ, అంత ఖురళియందు నితం డత్యధికుం డని కృతనిశ్చయులై యశ్వారోహ
కత్వంబుఁ బరీక్షింపం దలంచినంత సిద్ధార్థుండు. 83.

గీ. కంటకాభిఖ్య నొప్పు నొక్క హరి నెక్కి, యెక్కుడగు గర్వమునఁ గడు నుక్కుమిగులఁ
దక్కఁగలరాజతనయుల తక్కులడఁచి, జయము గైకొన వార లీర్ష్యకుఁ గడంగి.

వ. ఈగుఱ్ఱం బీతనిది కావున నీపందెము మే మొప్ప మని వివదించుచు. 85,

గీ. మిగుల నవలక్షణంబులఁ బేటి యైన వాని నొకవాజిఁ దెచ్చి యద్దాని నెక్కి
తనపటిమ చూపెనేని యొప్పనగు ననుచు, నట్లు చేయంగ సిద్ధార్థుఁ డనుమతించె.

వ. ఇట్లంగీకరించి యతం డద్దాని నెక్కుటకు మున్న దాని మంచిచెడ్డలు పరీక్షించు
టకై యర్జునుం డనువాఁ డయ్యశ్వంబు నెక్కుటయు. 87.

క. అదియెయ్యెడ నిలువక దు, ర్మదమున నవ్వానిఁ గఱచి మహిఁ బడవైచెన్
గదిసి యొకకొంద అయ్యా, పదఁ దొలఁగించుటయుఁ గొంత భరమై తోఁచెన్.

మ. అది సిద్ధార్థుఁడు చూచియు న్భయము లోనావంతయు న్లేక దా
నిఁ దగం దువ్వుచుఁ గళ్లె మైన నిడకే నేర్పొప్పఁగా నెక్కి పూ
ర్వదశం బందెను లెల్ల గెల్చె మిగుల న్వావిందలు న్సన్నుతు
ల్పాదలింపంగను సుప్రబుద్ధుఁడు మహామోదంబుతో నిండఁగన్. 89.

చ. మతి మును గోరినట్టి ధృతిమంతుఁడె నాథుఁడుగా లభించె నే
నతి సుకృతాత్మ నంచు ముద మందుచు వేగ మధూకపుష్ప సం
గత మగుమాల కేలఁ గొని కాముని కిం బయి పెచ్చువచ్చు రా
సుతుగళమందు వైచెను యశోధర యాదరమేదురంబుగన్. 90.

గీ. అమరు లతిమోదమునఁ గుసుమములు గురిసి, రచ్చరలు నాటపాటల మెచ్చు గొలిపి
రనిలము సుఖప్రచారమై యతిశయిల్లె, నలయశోధర సిద్ధార్థు ననుమతింప. 91.

వ. ఇట్లు యశోధర సర్వార్థసిద్ధుని వరించినపిదప జీలుఁగు బెండులు రెండు దెచ్చి
పాల్లలోఁ బడవైచి యవి తమంతటఁ దామ కలసికొనుదనుకఁ జూచి సునంగ
తంబు లగునంతఁ బెద్దలగువార లవ్వధూవరులం గూర్చి మీర లివ్విధమున నెడ
తెగని చెలిమి గలిగి యలరుదురు గావుతమని యాశీర్వదించి పరిణయం బొనర
చ్చిరి. ఈక్షీరపరీక్షణంబు శాక్యుల వివాహంబునకుం బ్రథమలక్షణం బిట్లు సల
క్షణంబుగా వివాహంబు గావుటయు శుద్ధోదనుండు. 92.

సీ. తేటిచూచినమాత్రఁ జేరిన మంచునఁ, దగుమలల్ చూపట్టఁ దగినచోటఁ
గృత్రిమవృక్షసంకీర్ణమా క్రీడాకుధరము దాదాపునఁ బరఁగుచోట
నుత్కృష్టమగు గంగకుపనది యైనరోహిణి యొడ నెడఁ బ్రవహించుచోట
నే కాలము న్సమమ్ము లెన్నేనిఁ బుష్పించు, పాదరింద్లు నల్దెసఁ బొదలుచోటఁ

గీ. బండ్లు తమయంతఁ దా లిన ఫలములు గల, వృక్షజాతు లెల్లెడల న్వెలయుచోటఁ
బంకజాదిసుమమ్ములఁ బరిఢవిల్లు, నమ్ములమ్ము లగు తటాకమ్ము లమరుచోట్ల. 93.

వ. కన్నులపండు వగుగతి నొక్కయారామంబుఁ గల్పింపంజేసి. 94.

శా. ఆరామమ్మునఁ గేళికాభవన మాహర్మ్యస్థంపుఁగుడ్యంబునం
దారన్ వ్రాసిన బంధచిత్రములు నాయాచోట్ల నారామమ
త్రీ రాణింపఁగఁజేయు కీరముఖ పక్షిశ్రేష్ఠముల్ నృత్తగీ
తారూఢిం గడు నాటితేలఁ దగు వేశ్యల్లల్ల సంధింపుచున్.  95.

క. అందుం గొడుకుం గోడలిఁ, బొందుగ వసియింపఁ బనిచె మునలితనము నా
నందాభావము రోగము, నందగు నిమ్మాట లటఁజనక యుండంగన్.  96.

క. పదిలపఱచి తగినభటన, ముదయముఁ గాపుండఁజేసి మొగిసుతుఁ డెందేఁ
గదలకయుండఁగఁ గారా, సదనం బేర్పఱచెఁ గేళిసదన మనుమిషన్.  97.

సీ. లలనయొనర్చు విలాసమ్ము లట్టిటుఁ, జననీని నంకెలలనఁగరాజె
కను గాననీక పైకొనునను రాగంబు, గాంధాంధకారంబు గావు టరుదె
పంజరస్థము లైనపక్షులు తనసాటి, బందుల దుస్థితిఁబడయు టరుదె
చంద్రానిలాంగజుల్ జముదూతలంబోని, యదయు లౌటంద్రొక్కులనుట తప్పె
గీ. ప్రణయకోపపరాఙ్ముఖిఁబడఁతిఁ దేర్పఁ, బడెడిపలుపాటు లచ్చటిపనులకంటె
నల్పములె యెన్ని విధములనైనఁ జూడ, బంధనాగారతుల్యంబు పడుకటిల్లు. 98.

క. ఆకేళీసదనమునకుఁ, బ్రాకారము లొక్కమూఁడుపచరించి యుయు
ద్రిక్తకవాటదృషద్వా, రాకలితమ్ములుగఁ జేయనట్లొనరించెన్.  99.

వ. మఱియు నవలివా రీవలకు నీవలివా రవలకుం జనకుండఁ గాపాడుఁ డని సేవకు
లకు నియమించి త్రిలోకసుందరు లగు పరశ్శతకట్టినుల నెప్పగిది నైనఁ గుమారు
మనంబు లోఁగొనుఁ డని నియోగించె నిట్లు పిత్రుపదిష్టుం డై సర్వార్థ సిద్ధుం
డక్కేళీగృహంబున యశోధరతో ననవరత సంభోగంబు లనుభవించుచుఁ
బురావృత్తాంతంబు లన్నియు మఱచి యాపద్వార్త కల్లైన నెఱుంగక సుఖా
తిశయంబునం బొదలుచుండి యొక్కనాఁడు.  100.

సీ. వికసితప్రసవగుచ్ఛకదంబసంభ్రమ, భ్రమదురుభ్రమరవిభ్రాజితంబు
పల్లవాగ్రాసనంపుల్లశీతారావ, వాచాలకోకిలాభానురంబు
తుహినపాతంపతత్సుమమరందాసార, పంకిలీకృతనవప్రసవరజము
శుకముఖత్రుటితికంచుకపక్వఫలభీజ, దర్పితాంకురకోగాధస్థలంబు

గీ. కిసలయాంతరపతితార్క♦కిరణజాల, వర్తులాకారముద్రికా♦వలయితంబు
లైన పూఁదోఁట కొక్క నాఁ♦డవనిపాల పుత్రుఁ డంగనలం గూఁడఁ బూఁ♦బోఁడితోడ.

క. చెలువయుఁ జెలువుంబును బూ,వులతోఁటం గ్రీడ సేయఁ♦బోయినఁ గని కా
వలివారెడపనుటయు నె,చ్చెలు లందఱుఁ దోడుసనిరి♦చెలువం బొలయన్.

క. నరసిఁ గరిణీవృతం బగు, కరిపగిది పరస్సహస్ర♦కాంతలనడుమన్
ధరణీంద్రకుమారుండును, గరము ప్రకాశించెఁ బుష్ప♦కానన మందున్. 103.

క. కడుకొని విరక్తుఁ డగు రా,కొడుకుం గడలోనఁ బుష్ప♦కోదండునికిన్
బడిపిల్లనిగాఁ జేసిరి, పడఁతులు చేయింపలేని♦పనులుం గలవే. 104.

మ. అటులాకృత్రిమకాననంబున నరేం♦ద్రాదిత్యుఁడుం గాంతలుం
జటులం బైనమనోజరాగమునఁ బు♦ష్పక్రీడ గావించు నం
తట శుద్ధోదనపాలితాఖిలధరో♦దారప్రదేశంబులం
బటుహాధ్వానము నాల్గుదిక్కుల ద్రువ♦న్వాయించెఁ బూవిల్తుఁడున్. 105.

వ. ఇట్లు తారాపరివృతుం డగుపూర్ణచంద్రునిపగిది నారీపరివృతుం డగురాజచం
ద్రుండు నిరంతరోత్సాహసంపన్నుం డై క్రీడించు నెడ. 106.

క. పదములు తడఁబడె ననియొక, మదిత భుజాలతలు సాఁచి♦భూవరునురముం
గదియించెఁ గాంతిన్యా, స్పదవర్తులపీనమిళితవక్షోజములన్. 107.

క. మొగమున నాసవపుంబుగ,బుగ లాలయఁగ రాజకర్ణ♦మున నూర్పుచ్చె
న్మృగుప యొక త్తరుణాధర, తగ విను మిది యొక్కయేక♦తం బంచు వెసన్.

సీ. సహకారశాఖహా♦స్తంబులు గీలించి, వలుదగుబ్బలుచూపె♦వనిత యోర్తు
మోఁనూలుపెక్కుసా♦రులకదల్చుచుఁ బీన, జఘనంబుగనిపించె♦సఖియయొకతె
యొకతమ్మిచేతఁబ♦ట్టుకొని పద్మాలయ, పోలెఁ బజ్జకు వచ్చె♦బాల యోర్తు
నెఱిగాణవోలె వ♦న్నెలుగుల్కఁ బాడుచుఁ, దాళంబు వాయించె♦దన్వి యొకతె
గీ. యెంద ఱెందఱు కామిను♦ల్తందరించి, నను జలింపకయున్న మా♦నవుని చేత
నభినయించుచునెదుటనా♦ట్యంబుసలిపెఁ జెమ్మటలుమేనదిగజాఱఁ♦జెలియయొకతె

ఉ. రాజకుమారు నెక్కతె సు♦రంబులఁజేతులు గట్టిపెట్టె నీ
వోజగణింపఁ జిట్టలయ♦యో యని వాయి బిగించె నోర్తు కాం
తాజనని శ్చితుండ వని♦తా నెకసక్కెము లాడె నోర్తు నీ
వ్యాజము నే నెఱుంగ నది♦యా యని నవ్వె నొకర్తు పక్కునన్. 110.

వ. ఇట్లనుత్తుణోజ్జృంభయిష్యమాణమదనోత్సాహు లగు సుందరులు చేయువికారం
బులకుం జొకారంబు గలిగినవాఁడుంబోలె నుండియు నాసర్వార్థసిద్ధుం డొక్క
యశోధరయందు మాత్రము బద్ధానురాగుం డై కొంతతడవున కుద్యానవిహారంబు
చాలించి తెఱవలతోఁగూడ మరలి నిజసౌధంబుఁ జొచ్చె నయ్యదంతం బంతయుఁ
బరిచారకులవలన విని శుద్ధోదనుండు సపౌరరాష్ట్రియప్రజాండు ముదంబునం
బొదలు చుండె. 111.

చ. ఎలమియశోధరాసరసి॰జేక్షణయు న్సహజంబులు న్విలా
సలలితభంగులు న్వితత॰సౌఖ్యకరంబులు నైనక్రీడలం
బలుకుల ముద్దుల న్నగవుఁ॰బాటలతేటల నీటుల న్ముదం
బొలయఁగఁ జేయుచుం దనుపు॰చుండెఁ బ్రియు న్భయభక్తియుక్తయై. 112.

మ. అతఁ డీరీతి యశోధరాకృతవిలా॰సాలోలుఁ డై యుండి దే
వత లప్డప్డు నిశీథమందుఁ దన స్వ॰ప్నంబందుఁ గన్పట్టి వి
జ్ఞతకై యాత్మ గుఱించి చెప్పుపలుకుల్॰స్పష్టంబుఁగా నిద్దురన్
బ్రతివారం బొకభంగిఁగాఁ గలవరిం॰పంబూను నుచ్చైర్గతిన్. 113.

వ. అట్టియెడ యశోధర యుల్కిపడి యతని లేపి యియ్యది యేమి యని యడిగిన
నేమియును లే దని యామెను సుఱిపించుచు మరల నెడనెడ నులయు వేశ్యావీ
ణాలాపాదికమ్ముల మైమఱచి మోహమ్మునం బడుచుండు. మఱియు నట్టియెడ
దేవతలయ్యెడకు వచ్చి తదేకగోచరులై. 114.

ఉ. ఎందులకుం జనించితి మ॰ఱేమి యొనర్చుచునుంటి వీ జగం
బందు సహింప యొల్లెడల॰వ్యాప్త మొనర్చుము రాజ్యపాలనం
బందును నిట్టి సౌఖ్యముల॰యందును మున్నక వ్యర్థమైన వే
ద్యంబు దిగంద్రావి వైళ ముప॰కారము లోకులకుం బొనర్చుమా. 115.

వ. అనుచుఁ బ్రతిపదంబును బోధించుచుండ సిద్ధార్థుం డొక్కనాఁడు ప్రపంచ విశే
షమ్ముల నెఱింగి తదుపకృతికి యత్నింపఁ దలఁచి చిత్ర యను నొకదాసి నడిగిన
నయ్యది సుహాత్మా యీయువి వచింప నాబోఁటి బోటి కెట్లు సాధ్యం బాయీ
విశేషంబులు దేవర చని కనినఁ దేటతెల్లంబు లగు ననుడు నతం డట్లకాక యని
చెన్నుఁ డనుసారథిం బిలిచి. 116.

క. ఊరంతయుఁ గనుఁగొనవలెఁ, దేరాయత్తంబొనర్చి తెమ్మన సూరీ
కారం బని పాఁ డరిగి మహారాజునకు న్వచించె నది యెల్ల వడిన్. 117.

గీ. రాజు విని కొడుకున కది రాజ్యకాంక్ష, గాఁ దలంచి పురమ్మధికమ్ముగా న
లంకరింపంగఁ జాటించెఁ బొంకముగ న,లంకరించిరి పౌరు లీలాధవాజ్ఞ. 118.

గీ. గ్రుడ్డివాండ్రను గుష్ఠరోగులను గుంటి, వాండ్రు రిక్తజనులు శోకవంతు లాది
గాఁ గలుగువారలెయ్యెడఁ గాని వీథు, లందుఁ గాన్పింపకుండ రాజానతిచ్చె. 119

ఉ. కన్నులపండు వౌ గతిఁ దగంబురమిట్టు లలంకరింప నా
చెన్నుఁడుఁ దేరునాయితము చేయుడు గ్రాసుతుఁ డంతఁ బట్టనం
బు న్నలువంకలం గనఁగ బూర్ణతరోత్సవ మొప్ప నేగి కాం
చె న్నరులందుఁ గల్గెడు విశేషముల న్మది కెక్కునట్లుగన్. 120.

వ. ఇట్లు కొంతవడి వీక్షించి మగలి స్వస్థానంబున కరిగి సుఖంబుండె నాఁటి నిశీథ
మ్మునన శుద్ధోదనునకు స్వప్నమ్మున నిట్లు కననయ్యె. 121.

గీ. భానుఁడును నింద్రచాపంబు లోనఁ గల్గు, నొకపతాక యనిలమున నొరగి నేలఁ
బడినఁ గొందఱు సన్న్యాసివరులు దానిఁ, గొని చనిరి తూర్పుదిక్కున కనుగడంగి.

క. దక్షిణఘంటాపథమున, నక్షతగతిఁ బదిగజమ్ము లరుగఁగ నందుం
దక్షతగఁ దొలియేన్గన్, శిక్షించుచు నెక్కి చనియె సిద్ధార్థుండున్. 123.

క. హరు లొకనాలుగు గడుప, త్వరమున లాగంగఁ జను రథమ్మునఁ దాను
స్థిరుఁడై సిద్ధార్థుఁడు సుం, దరమూర్తి ముదమునఁ జనియెఁ దనయంత వెసన్. 124.

గీ. సొబగు చిత్రము లెందు నంచులను చనరు, గనకమయములు మాణిక్యఖచితములును
నగునదము లొప్ప నలరు సంఘాంగ మొక్కఁ, డొక్కయెడనుప్పెఁ గన్నులకు
క్కజముగ. 125.

గీ. ఒక గిరివరంబునందుఁ బొల్పొందు నొక్క, భేరిక నయోమయం బగు పెద్దకఱ్ఱఁ
గరమునంగొని ధ్వాంక్షతి గడలుకొనఁగ, నట్టె కొట్టుచునుండె సిద్ధార్థుఁ డెలమి

గీ. పాడవునఁ దనర్చునొక్క గోపుర ప్రశిఖర మందుఁ గూర్చుండి పదములు హస్తములును
జాఁచి యొకఁడు రత్నమ్ములు చల్లఁగ్రిందఁ, నేతికొనుచుండిరొకకొందఱివలనవల.

క. ఒకయార్గురుజను లొకచో, వికలత్వ[illegible] మొగములందు వ్రేలాడఁగఁ బం
డ్లుకొఱికికొంచు నజస్రా, క్రకలుషితాత్ములయియేగ సాగి రనదలై. 128.

గీ. కెలన నున్న చెన్ను నడిగి॰ కేను మేలు, లాత్మ(బట్టించుకొనుచు న॰ట్లరుగ నరుగ
వేఱొకటం(జూచ్చెబందుగు॰ల్వెక్కి వెక్కి, యేడ్వవచ్చెడుసబమొక్క॰ డెదురుపడియె.

గీ. కొమరుడగ్గియుంగొండడయుం॰గొనిచనుచం(గ, వక్త్రమొక్కింత గన్పట్ట॰వస్త్రసంవృ
తంబుగాం జేసి పాడెపైం॰వగంబరుండు, జెట్టి నల్వురు వహియింప॰వెడలె శవము.

చ. పదపడి కంకగృధ్రముఖ॰పక్షిసమాకులము న్శివారివా
స్పదము ననేకవాహక శ॰సప్రచురంబును నైన వల్లకా
టిదరిని జెట్టి యాశవము॰డెప్పరమై చను వహ్నిగాల్ప బూ
డిద యగుడు న్శృగాలసుతు॰డెందను చందము భిన్నభిన్నమై 142.

క. వివశం బగుటయుం జెన్నని, నవలోకించి మన మిట్టు॰లగుదుమె యన వాం
డువలుకు సిద్ధార్థునికిం గ,లవిధం బిప్పగిదిం దాం గ॰లంగెడి మదితోన్. 143

గీ. పుట్టుటయుం గిట్టుట యు మఱియం॰బుట్టుటయును, దిరిగి కిట్టుట యనునది॰దేహధర్మ
మేల తప్పింపనగుం జక్ర॰మెట్టు లట్టు, లీప్రపంచమ్ము తిరుగు భూ॰మీశమౌళి.

వ. అనిన విని యది యంతయు మనంబునకు గోచరంబు చేసికొని యారుద్రభూమి
విడిచి మరలి నగరపుంటాపథంబున వచ్చుచుండ. 145

చ. సిరిచెడి బిట్టువంగిన క॰సేరుకయుం గను కొప్పలుం బర
స్పరము గడించు మైవళులు॰ పాతరలాడు శిరంబు సర్వము
న్నరసిన కర్ణలోమము ల॰ణంగినపిక్కలబల్మి వోమునం
దొరంగెడిలాల గద్గదుని॰తొక్కును గాంచెం గుమారుం డొక్కెడన్ 146.

క. వడవడ వడంకుచుం బదములు, తడంబడ హస్తమున నొక్క॰దండము గొని యె
వ్వండు వచ్చుచుండు వీం డని, యడిగిన నృపసూతి కిట్టు॰లనె సారథియున్.

ఉ. రూప మడంగు బుద్ధియును॰రూపఱు దేహబలంబు క్రుంగు సం
తాపము హెచ్చు నాశలును॰ దామరతంపర లై జనించు వి
ద్యాపటిమంబు తగ్గు విష॰యంబులుం బొల్పఱు దేనిప్రాపునం
దాపరమమ్ము నా జరయ॰నందగు రోగ మొకండు వీనికిన్ 148.

క. చవి యొఱుంగమి నింద యనా, శువమును లేకుంట పండ్లు॰డంగుటయును ము
న్నవు విధములు దలంపంగ నెం,డవబాల్యము సుమ్ము మదిమి॰ యవనీంద్రసుతా.

క. అన విని బుద్ధుండు చిత్తం, బునం గూరిన వంత పేర్చి॰కొరిం బొరి నాలో
చన మొనరుచుచుం జనియె స్వదనమునకుం బనివి వనివి॰తత్తర మొలయన్

## ఆశ్వాసాంతపద్యములు.

క. సంతతరవికాంతిద్యుతా, సంతతధరామండలావ•నాసక్త హృదు
స్స్వాంతాంగ్లేయప్రభుసా, సంతతధరాపాల లోక•మానిర్జిలా 151.

ఉ. రాజతరంగిణీప్రముఖ•రమ్యతరాంధ్రవచఃప్రబంధక
ర్తా జయశీల ముద్రితపు•రాతనకర్తృకసత్ప్రబంధసం
ళీజనితాతికీర్తిధవ • ళీకృతసర్వదిగంతరాళ స
త్తేజ భుజాలసద్వసుమ•తీ సుమతీ వరకృష్ణభూపతీ. 152.

## భుజంగప్రయాతము.

జగద్గీతకీర్తీ భృ•శప్రేమమూర్తీ
నగాధీశధీరా ఘు•నత్వప్రచారా!
యగోద్ధర్తృమానాస•దాభ్యస్యమానాం
ధ్రగీర్వాణభాషాచ•రాకృష్ణవేషా. 153.

## గద్యము.

ఇది ....శ్రీతిరుపతివేంకటేశ్వరప్రణీతం బగు బుద్ధచరిత్రం
బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



క. ముండితశిరస్కుఁడై యొక, దండము కేలఁ గొని యేక♦తముగా వనముం
దుండినమునిని గనుంగొని, యెం డెందమునందు వింత♦యుం బెసలారన్. 6.

వ. కని నీ వెవ్వండవు యేమికారణంబున నిట్టి వేసమూసాదించితి వని యడుగ నుష్ప్రవిష్యమాణమహాప్రబోధోదయుం డగుసన్న్యాసీశ్వరుం డిట్లనియె. 7.

క. నే నొకసన్న్యాసి నర, జ్ఞానిం దపమాచరింప ♦ నరుదెంచితి నా
ధ్యానము మోక్షము చెందుట, కై నావుడు రాజసుతుఁడు♦ క్రమ్మఱఁ బలికెన్. 8.

సీ. తల్లిదండ్రులు నీకుఁ ♦ దప మాచరింపఁగ, నెందుఁ బొమ్మని యాన ♦ యిచ్చినారె
వా రేమియైరి నీ♦ పరిణయం బైనయి, ల్లాలి నెచ్చోట ♦ నుంచితయ్య యనుచు
నడుగ నయ్యోగి ♦ యిట్లనుచుండె నెం జేసి, పరిణయం బొనర్చి ♦ బంధముక్తి
నెనయు నేతల్లిదండ్రులు♦ లెవ్వ రైనఁగొడుకు సన్న్యాసంబుఁగొనుమని♦ యానతిచ్చువారె

గీ. యవని మోక్షేచ్ఛ గలవా♦ రఖిలబంధు, పుత్రమిత్రకళత్రాదు♦ లుఁ గలవను
సంసరణవార్ధిఁ బడకయే♦ చనఁగవలయు నుగ్రకాంతారమున కేగ♦ కూడదు విడిచి.

వ. కావున నేను మోక్షార్థినై పరిణయపాశంబునం జిక్కుకొనక తల్లిదండ్రుల కన్నుఁ గప్పి యీఘోరారణ్యప్రదేశంబునం దిట్టివేసంబునఁ దపంబు చేసికొనుచుంటి ననవుడు నరేంద్రనందనుం డిట్లనియె. 10.

మ. తరుణీపాశమునం దగుల్కొనక స♦త్యజ్ఞానసంపన్నుఁడై
తరణోపాయముఁ జూడఁగావలయుఁ దత్త్వం బింతయే కాని యి
క్కరణిం దండముఁ గావిచేలములు నే♦ కాలంబునం దాల్చుచున్
శిరముం బోడి యొనర్పఁ గారణ మొగిం ♦ జెప్పంగదే నావుడున్. 11.

సీ. సాంసారికులతోడి ♦ సాహచర్యము ముముక్షు, జనులకుఁ దగదు సాం♦సారికులకు
సన్న్యాసులగువారి♦ సహవాసమును గూడ, దట్లు లైన నిరుదెగ♦లదగు నిజము
కావున మోక్షేచ్ఛ♦గలవారి కడవియు, సాంసారికుల కెల్ల♦ జనపదంబు
వాసంబుగా నేలు♦ సంచితిరి తొల్లింటి, పెద్దలు వేషంబు♦ వేఱుగాఁగఁ

గీ. బుట్టములఁ గావిరంగును ♦ బోడితలయు, యోగులకు నిర్ణయించిరి♦ యుక్తి చేసి
కాని ముక్తికి నిది యొక్క♦ కారణంబు, గాదు ప్రతిబంధకంబును♦ గాదు తలఁప.

గీ. అనుచు నెఱిఁగింప మొక్కి పీ♦ డ్కొనుచుఁ గదలి
స్నేహితులుగూడ వెంటవ♦ చ్చినకతమున

వన్యకరిరాజు ప్రోలికి ♦ వచ్చుపగిది
మరలె నగరునకుఁ దురంగ♦మంబుతోడ.

వ. ఇట్లు సర్వార్థసిద్ధుండా నాఁటిపవలెల్ల నరణ్యంబునం బుచ్చి నగరికిం బ్రవేశించ నెడ భువనబంధుండును. 14

శా. సిద్ధార్థుం డిఁక నేఁటిరాత్రి మొదలా♦సింపండు సంసారమా
నద్ధజ్ఞానమునం జగం బఖిలము♦న్సంధించు సంసారపు
న్నధ్వంబు వహించు నంచుఁ బృథివిం ♦ జాటించి యాపైనుడు
న్వృద్ధామస్థులకు న్వచింపఁ జనె నా♦వారాశిఁ జేరె న్వడిన్ 15

గీ. ఎల్లినుండియు నితఁడింక♦నెపుడుఁ గట్టు, నట్టివస్త్రంబులను గట్టు♦కట్టిపుట్ట
ములు ధరించునటంచుఁ జె♦ప్పఁబల్కిదోఁప, నేయెడలఁ దోఁచె రంజకేం♦జాయ దెసల

గీ. పంకజాత యసటుఁ దన్నుఁ♦బాసి యరిగె, రవితయీమయుఁ డనిసలి♦నివగనిగుడ
మగుడఁ దలయెత్తనేరని♦మాడ్కి నెప్పె, నకట నొసఁగేరకైన ల♦జ్జావహంబు.

గీ. పుష్పవతి యైన పద్మిని♦పొందు చేసి, తనదు తేజంబు క్రమమున♦డిఁగి పోవఁ
బశ్చిమసముద్రమున మున్గి♦పాపమడఁగ, ననఁగ రవి క్రుంకెఁ దద్దిశా♦భ్యంతరమున.

క. ఎల్లెడల మనపతంగుఁడు, బల్లిదుఁడై క్రుమ్మరు నెటుఁ ♦ బట్టువడెనో యా
పల్లినుఁ డగుచు ననుగతిఁ, గొల్లలుగఁ బతంగకులము♦గూయఁగఁ దొడఁగెన్.

గీ. సూర్యుఁ డనుజ్ఞాన మెందేనిఁ♦జొచ్చుటయును
నలమెఁ దమము బ్రహ్మాండము♦నందుఁ బ్రబలి
దానిఁ గని మైఁపలేనిసు♦జ్ఞాను లనఁగ,
మిగులవాపోవఁ దొడఁగెఁ బ♦క్షిగణమప్పుడు.

సీ. ముల్లోకముల కేని♦యిల్లాలు తనయింట, వెలిఁగించుకొనిన ది♦వ్వియ యనంగఁ
బ్రాచికేళీయర్య♦పయిఁ గోల్పడిననిగ్గు, గలయొంటితెలితాలి♦కమ్మ యనఁగ
నాకాశడోలాంత♦రాకాశమానకం, శుకరవిలాసకం♦తుక మనంగ
దెలిగంటినోరపట్టి♦పలు పుట్టుయ్యాలమంచ, మునకుఁ బైఁ గట్టిన♦ముకుర మనఁగ

గీ. జంద్రుఁ డుదయించెఁ జక్రము♦ల్సంచలించెఁ, జంద్రికాపత్తు తెలిమిమై♦సంచరించె
సరసకైరవసంతతి♦సంతసించెఁ, బద్మినీకాంత తలవంచి♦పవ్వళించె. 21.

గీ. అంబరము తనమణి పోవ♦నార్తిఁ గూరి, యెన్ని యోదివ్వెలను బెట్టి♦యెందు వెదకి
విసివి పెద్దదీపమ్మును ♦ బెట్టె ననఁగఁ, దారలును జంద్రుఁడును గ్రమ♦దశ నెసంగె,

వ. మఱియు.

సీ. తంజాపురీనీల•కంజాతనయనల, చెండుచెక్కులు పుల్కరింపఁ జేసి
కాంచీపురీదేశ•ఘనసారగంధుల, పాలయల్క పెక్కునారులు పరిరంచి
కర్ణాటకామినీ•ఘనశిరోరుహముల, కనమాన నైగనిగ్యంబుఁ దెచ్చి
కుంతలప్రాంతక•న్యాంతాయతాక్షుల, చెలువలమూర్తి పెం•చ్చింపఁజేసి
గీ. యమితతృష్ణార్దితభుజంగ•సముదయప్రపుదవిధానార్హ్వకుకలసం•పదలఁ బొదలి
మలయనిలయపటీరద్రు•వలయనిలయ, మారుతంబులు చెలరేఁగె•మాసరమున. 24.
వ. అట్టిసమయంబున సర్వార్థసిద్ధుండు విశ్రామనామకం బగుకేళికోద్యానంబునఁ దొల్లింటిపగిది యశోధరాసహితుం డై యనర్ఘమణికుట్టితంబును ననేకచిత్రాలంకృతంబును గృత్రిమద్రాక్షావల్లీసుమహితోల్లోచభాసురంబును మౌక్తికసరసముజ్జ్వలద్భిత్తివ్రజంబును బహిఃస్థితగాయన్నానాగాయనీజనసంకులంబును గమనీయపరిచారికాబహుళంబును నగుసౌధంబున. 25.
సీ. జాలమార్గప్రవి•ష్టమ్ము లౌ వెన్నెల, లవ్వజ్రభిత్తుల సుధా•భ్రాంతిఁజేయ
నవరత్నరుచిరపా•త్రవిశేషభాస్వత్ప్ర, దీపమ్ము లొండొంటి•తేజ మిగులఁ
దులలేక తగుహంస•తూలికాతల్పంబు, పఱచిన యద్దంబు•భాతి మెఱయ
నుల్లోచ మయ్యెడ•నుండు నలంకారములకన్నిటికి వింత•పొలుపు నెఱప
గీ. నలుదెసలకుమ్మ్యముల నొప్పు•నిలువుటద్దములు గుణించి పదార్థస•ముదయము ప్ర
వృద్ధముగఁ జూప నెల్లెడ•వేడ్క లొదవఁ, జాలు ననవద్యకేళికా•సదనసీమ. 26.
క. కేళీలోలతఁ గొండొక, కాలము వర్తించి తత్సు•ఖపరవశుం డై
లీల మెయి నిద్రవోయెడి, వేళకు ధామద్వయంబు•వైడలం జొచ్చెన్. 27.
వ. అయ్యెడ. 28.
సీ. కలలోఁ బవలిటిసం•గతుల నృత్యాదుల, నెంచి సారెకలవ•రించు నొకతె
కంకణారావమ్ము•గానమ్ముగా నిటు, నటుఁ గదలుచు నిద్ర•నందు నొకతె
వీణ మీటుచు రస•వివశ యై యారీతిఁ, గదలక నిద్రింపఁ•గడఁగె నొకతె
శృంగము లవ్వకుచసం•సంగమ్ము గన లేటి, తనప్రక్క నులయ ని•ద్రగను నొకతె
గీ. పొలఁతు లిర్వు రొకపొగడ•పూలమాల, గ్రుచ్చుచుండంగ నం దొక్క•కోమలాంగి
యలసి యాదండ యుపధాన•మగుగతిఁ బవళింప నద్దానిపైఁ బవ•ళించె నొకతె.
గీ. ఒకతె పెంపుడులేడిపిల్లకు గులాబి, పువ్వుదినిపింప నది కొంత•పూవు దినియుఁ
గొంత తినుచు నిదురగొనఁ•గువలయాక్షి, తాను దినిపించుచునె నిద్ర•తగవహించె.

సీ. లలిత ల్యాందము లేక కానవన సుల్లంఘించి పైపచ్చు దీ
పలసత్కాంతులు రోహిణీమదవధూ ప్రభ్రంశితాచ్ఛాదనో
జ్జ్వలగాత్రావయవాళికి న్మిగులదృశ్యత్వంబు సంధింప వె
న్నెలపైబ న్నిదురింప సాగిరి సుదాంశ్రీభూతచేతస్కలై. 31.
గీ. ఇట్లు లోకకీర్తిం గాక యొకస్త్రీనిగాంచల్ల, నతులనిద్రాభరాలసలైన యావె
లందు లో వచ్చుచున్న గులాబి పువ్వు, లనఁగ నెంతయు శోభనొప్పారి రపుడు.
వ. ఇట్లు లక్ష్మీగృహబహిస్థితు లగుతత్జనంబు లెల్లగాఢనిద్రానుగతులై యుండ వెం
డియుం దత్సదనద్వారసంతమ్మును గనకలతాచిత్రితంబును నీలవర్ణమ్మును జందన
కాష్ఠావలంబితంబు నగుతెర యొద్ద గంగాగౌతము లను పరిచారిక లిరువురు ప
న్నుండి యుండ నమేయంబును నిశ్శబ్దంబు నగు నయ్యర్ధరాత్రంబున. 32
గీ. ధవునిభుజదండమందు యుపధానముగ ని,దురగొనుచున్న యలయశోధరకలగని
తగనివగ నిగుడంగ లేచిమగని కేలు, మూఁడుసార్లు ముద్దుకొని మొనసి లేపె.
క. కన్నీరు కాల్వ గట్టఁగ,నన్నెలఁతుక పైఁట గుబ్బలం దిడుకొనుచుఁన్
సన్నపుబెలుఁగున నాథుని, మన్నన దనుపార లేపి మనవి వినుఁ డనన్. 35.
గీ. ప్రార్థనాపూర్వమైనయప్పడఁతిపలుకు, విని యదరిపాటుమై లేచి విహ్వలాత్మ
యైనసతిఁ గాంచి పల్కె సిద్ధార్థుఁ డబల, యేమి కారణ మిందులకెఱుఁగఁ జెపుమ.
క. నావుడుఁ జెప్పఁట కాసతి, భావం బెడ తెగక మిగుల వగలం బొగలం
గా విభుఁడు పలువితమ్ముల, నావెలఁదుక ననునయించె నది చెప్పింపన్. 37.
గీ. అటు లనునయించుపతి కిట్టులను మృగాక్షి, నాథ చెప్పెడి దేమి యీనాఁడు నాకు
వేకటి యొదవె నర్ధానివేళ వెతింగి, మించుముదమున నేను నిద్రించుచుంటి. 38
మ. అకటా యిప్పది యెట్లు చెప్పనగు నాథా నిద్రలో నొక్క పా
డుకలం గంటి న దెట్టి దన్న నిటులట్టు ల్కాసుల్లం జిమ్ము కొం
పొకయాఁబోషు మణిప్రభోజ్జ్వలితమైరెబు ష్పాను చిహ్నంబు విం
తకు వింత న్మగమం దెలప్ప నెదుటం గన్పట్టె శైలాకృతిన్. 39.
గీ. విచ్చలవిడిఁ దిరిగెడి యావృషభరాజుఁ, బట్టలేకున్నఁ బోవు మీభాగ్య మనుచుఁ
బలికె నంబరవాణి యప్పలుకు విని యు, నెవ్వరును బట్టలేకుండి రించుకేని. 40.
ఉ. ఎమ్మెయిఁ బట్టరాక కడు నేపునఁ బొల్చుచునున్న యమ్మహో
క్షమ్మును హస్తమున్గ్రమున గట్టిగఁ బట్టితిఁ బట్టినంతనే

హు ద్మని యార్చి పర్వతస•మున్నత మా తనువు వ్విదక్కి పం
తమ్మున నన్ను మీాఱి చరణంబుల భూమితలం బడల్చుచు౯. 41.

క. లెంకల నెల్లరఁ బొడిచి ని,రంకుశగతి వరణ మొక్క•యంజగఁ బజలా
హంకార మెసఁగఁ దాఁటి త,లఁ కెల్లర కొదవ నేగె•లావు నెఱయఁగ౯. 42.

గీ. ఇద్ది యొకకల యిఁక నొక్కఁ•డెట్టు లనిన, దేవవాహేలు నాల్గు గు•తిరిగి చుట్టి
వారముగ నిప్పురమునకు•వచ్చి వైజ,యంతిక నెకందు నాటిన•యంతలోన. 43.

క. రవి యుదయమందె మఱి వా,యువు వీచె౯ దానవర్ధి•యు న్విరఁబాఱె౯
వివిధగతి నక్కరము లు,న్నవి దాన ననంగ సతికి•నయ్యవఘుండు౯. 44.

క. పలుకు నిటు లబల విను మి,క్కల నిక్కల శుభన మేద్వఁ•గా నగునా యాఁం
గ లలన ధవునకు ని ట్లను, బలుకులలో విన్నదనము•ప్రబలింపంగ౯. 45.

గీ. ప్రాణనాథ మూఁడవకల•యవధరింపు, కాలము సమీాప మయ్యె నిం•కఁ పడవేల
యనుచుఁ బలు కొండు వినఁబడె•నంతటను నుప,ధానము దెస నిగిడ్చితి• నేను దృష్టి.

గీ. అచట దేవరధరియించు•నట్టి వస్త్ర, ములు గనంబడెఁ గాని మీ•మ్ముఁ గనవైతి
మున్ను మీారు నా కిచ్చిన•చిన్ని మాల, నడుమునఁ జూడఁ బాసు గా•నాకుఁ దోఁచె.

క. అందెలుఁ గంకణములు జా,ఱెం దిలకింపంగ శయ్య•స్ఫుటివిం బడె నే
మందు న్మరాళ్యాదాపట, మొందె న్శిథిలత్వ ముక్కు•మొక్కం దఱచె౯. 48.

గీ. మీాఁద గుండెలు జల్లన•మేలుకొంటి, నిట్టి చెనఁటికలకు ఫల•మెన్ని గజల
మనయిరువురందునొక్కరి•కి నిమృతియగు,నంచు నెంచిశోకించెదఁ•బ్రాణనాథ. 49.

మ. అను ప్రాణేశ్వరిపల్కుల న్వినుచు సి•ద్ధార్థుండు తా నవ్వి నీ
కును నాకుందొసఁ గిక్కలం గలుగ ద•య్యం బోలుపుత్రుండు నీ
కు నొకం డుద్భవ మందు నెన్నటికి నీ•కు న్నాకు సంబంధ ముం
డు నిటు ల్మద్వచనంబుల౯ హృదయమం•దు న్విశ్వసింపం దగు౯. 50.

క. అని యనునయించి మఱి యి, ట్లను సిద్ధార్థుండు దుఃఖ•మందు మునుఁగు భూ
జనుల కుపకారములు న్నా, కొనరింపఁగవలసి యున్న•వోగజగమనా. 51.

క. ఏ నేమార్గంబున కై, పోనుంటి నె యట్టిమార్గ•మునకీవును రాఁ
గా నయ్యెడి శోకింపం,గా నేటి కటంచుఁ బేర్మి•గడలుకొనంగ౯ 52.

గీ. కాఁగిలించుకొని మొగ•మ్మున మొగమిడి, ముద్దుపెట్టుకొని సు•ముఖిని జేసి
కంటినీరు దుడిచి•కాంతకు సిద్ధార్థుఁ,డిట్టు లనియె మరల•నెనక మెసఁగ. 53.

వ. అని వెండియు. 66.

సీ. అనవరతంబుఁ దియ్యనిపల్కులం బల్కుచుసుమ గొల్చెడు కీరముఖ్యులార
గాఢాంధకారంబు గలఁచి యంతతదీప్తిఁ బొలుచు రత్నదీపంబులార
యనుపమంబును బుష్పసంపరమ్మున దాల్చు పలుపలనిల్వుటద్దమ్ములార
పరిచారికలభంగిఁ బరిచర్య సల్పుచుఁ బొల్పారు జంత్రంపుబొమ్మలార

గీ. యరయుర యొకింత లేక కాయమున మైత్రి దనరి పోషించు సుఖసాధనమ్ములార
తప్పుఁ గల్గిన యోపుదాక్షిణ్యములార, పనిపి పయ్యెదఁ జి నన్నుఁ బొకఁ బంపుఁ డిమ్ము.

వ. అని బయలువెడలి యతండు. 68

మ. ఒకకొం తేగును సంతోషింపును సముద్యుక్తత్వముం జెందు వే
ఱొకకొం తేగు యథాస్థితిం గను నిరుద్యోగమ్ము వాటించు వె
న్కకుఁ దో తెంచుట కిచ్చగించు నట సన్న్యాసార్థి యై యాను గా
కకటా యెవ్వనికేని శక్యమగునా యాస్థానిఁ వర్జించుటల్. 69.

వ. పదంపడి యొట్టకేలకు నిద్రించుచున్న కాంతాజనమ్ములమధ్యమ్మునుండి నిశ్శబ్దమ్ముగ
నడిచి మందపవనుఁడు గమనానుకూల్యంబు సూచింప మెల్లనఁ జెన్నుని లేపి
కంటకంబు నాయితంబు గావింపుమని కలతెఱంగు వచించిన వాఁ డిట్లనియె. 70.

చ. మిసిమి వెనంగుఁ బ్రాయమును మేటిసిరుల్ కొఱఁతలేని రాజ్యము
రసికతయుం బసందైనఁ గురాకొమరుండవు సాధ్వియైననీ
దనతి నకారణంబ విడి పొంగతనమ్మున రాత్రివేళ స
న్న్యసనము పూనెదంచె దకటా సుఖమూనెవిరాగ మేరికిన్. 71

చ. స్థలమునఁ బండఁగావలెఁ బ్రసాద మటంచును సాధ్వి లిచ్చు భి
క్షలు గ్రహియింపఁగావలెఁ బొసంగదు వేళకుఁ దిండి తిన్నచో
నిలువఁ గరాదు నిల్చినను నిల్చినచోటఁ బరుండరాదు నీ
తల మగునే యతిత్వమును దాల్చుటవయ్య నరపాలబాలకా. 72.

మ. అడవుల్ త్రావులతోఁటలే గుహలు క్రీడాగారవారంబులే
మడుఁగుల్ బావులె క్రూరసత్త్వములు నర్మస్నిగ్ధసఞ్చారులే
నడిప్రాయంపుఁ దలోదరీమణిని నన్యాయంబుగా డించి పో
యెదు వాని న్నను నే మనంగలదు మేలే ప్రాయమందిప్పనుల్. 73.

ఉ. ఈవలయన్ను లెంతకును హెచ్చు లనం దగదే ప్రశస్తసు
శ్రీ వెలుఁగొందు నీమణులఁ జేరులు గాంచితె వేయునేల నా
నావిధభూషణంబు లివి నాకిఁ డె యుజ్జనకుండు పిన్ననాఁ
డీవు ధరింపు మీ యిఁక మఱేటికి నా కట సన్న్యసించితిన్. 90.

క. ప్రాణమునకంటె హెచ్చిది, దీనిం దీసికొని వేగఁ దెరలిచను మటం
చాశుద్ధనందనుఁ డశ్వము, పై నెంతయుఁ బేర్మిఁ జూపి పదపడి యనియెన్.

శా. చెన్నా మజ్జనకుండు నాకయి కడుం జిక్కించు శోకంబు నా
పన్నేరం బెటులేని శీఘ్రముగ నేవత్తున్ బరిక్షీయమై
యెన్నంగాఁ బగువస్తువుం దెలిసి నీవీమాటలే తెల్పు ప
ద్ధమ్మున్నీ రేజము సంతసంబుఁ గనునల్లి ల్లెని సంధంపుమా. 91.

వ. అనియనిపిన వాఁడును గన్ధృతఖలీనం బగు కంటకంబుతోడఁ జనలేక చనలేక
వెనుకఁ జూచుచు రాజపుత్రుని చెయ్యాల కచ్చైరువందుచు వచ్చినత్రోవ
యెఱుంగక కపిలవస్తుపురాభిముఖుండై చనియె. 93.

మ. అటు లాచెన్నునిఁ బంపి చేరె నటసిద్ధార్థుండు స్వర్గంబు మా
ఱట నాఁ జెన్నగు బింబిసారుపురికిం బ్రాంతంబునందుం గురు
ట్పాటలీపక్వఫలప్రసూననిచయ ప్రచ్ఛాయధారాలల
త్తటరమ్యాన్నతరత్నసానుకకుభృద్దర్శాంతరాళస్థలిన్. 94.

వ. ఇట్లు ప్రపంచపరమార్థ జిజ్ఞాసాకందళితం బగుడెందంబున నమ్మాయాదేవీనంద
నుండు సకలరాజ్యభారంబు పరిత్యజించి యతివేషమ్మున నారత్నగిరికెలంకులఁ
దిరుగుచున్నంత. 95.

గీ. తమముఁ గుఁ బ్రాణిశోక కాంతలకు జోక, పదనుమాన్పించు నైకపాపహరిపాక
మాకులత్వవిలోలైక ఘూకలోక, మేగుదెంచెను నలవోక వేగుఁబోక. 96.

చ. తమి యను గోపకాంత భవధంబనుకుండను జ్యోత్స్న పేరిత్సీ
రములను దోడువెట్టి ఖగరావము కవ్వపుమ్రోఁతగా నిశాం
తమున దధి న్మథించి గళితం బగువెన్నను ముద్దచేసి త
క్రమునకు మధ్యఁ జేర్చె ననఁ గాఁ దగె వెన్నెల వేగుఁజుక్కయున్. 97.

సీ. ఒడ్డు విడిచి లోనఁ బడ్డ గంగాఝరి, తిరుగఁ బంక మెడలి తేఱునాఁటి
చెలువు గలిగె వెన్నెలీలకు ప్రాభాతిక, ప్రభలు మెల్లమెల్ల బలియఁ జొచ్చె. 98

క. మానిత మగు వేసముఁ గొని, తారానిధియు నిశాధిపవిలాసినిని దనమో
మానం బుడిపి కనంచిన, పానుపుపైవలువ యనఁగ భాసిలె నభముల్. 99.

చ. పడమటికొండ లేటిచెలువ ల్తమమూతులు సాఁచి నాకఁగా
నుడుపతిబింబమందు నెలవుండిన యిఱ్ఱి సుఖించెఁ బ్రాచి య
న్పడఁతుక భాస్కరప్రసవబాహుకుఁ బాశక మూలుచుండె నా
వెడలెఁ గపోతహుంకృతులు వీనులకుం గడుసొంపునించుచున్. 100.

సీ. ఎంత హానికి వచ్చె నెంతదుస్థితి కట్టాయను వెరంగున వెల్లనయ్యె దెసలు
ఇవి రాజసుతులు చేయవలసినపనులు, గావుకావంచుఁ గాకంబు లఱచె
జగములం దున్నయజ్ఞాన మింక నశింపఁగల దన్నపగిదిఁ జీఁకట్లు విరిసెఁ
దొలఁగు నీగతి సర్వదుర్మతంబు లటంచు, నోడుపుపోలికఁ జుక్కలడఁగిపోయె

గీ. దుష్టులీగతి నింపోవుదు రనురీతి, నెనఁగె నుప్పొద్దిత క్రూరమృగరవంబు
జ్ఞాన ముదయించు నింక నీకరణి ననుచు, వింటుదయించెఁ బిచ్చుకకుంటువేల్పు.

సీ. భూసురాఘ్యప్రదానాసివిచ్ఛిన్నమం, దేహారుణాసృక్ప్రదీప్తి యనఁగ
నుదయించుచున్న సూర్యుని నెదుర్కొనఁబోవు, కమలినీగాఢరాగం బనంగఁ
జక్రవాకీహృదబ్జమునుండి పైకి వెలలిపాఱు శోకానలం బనంగఁ
బ్రసవవేదన పడుప్రాచిపై దిగఁ జుడ్చి, పాఱఁబోసిన రక్తనీర మనఁగ

గీ. నబ్జవైరికి నిసికిఁ బెండ్లైనచోట, జంపతుల కైనడేగాటసమయమందు
భూమిపైఁ బడినట్టిబుక్కామనంగఁ, బొలుపువహియించెఁ జక్కఁగాఁ బూర్వసంధ్య

చ. కలువలు నిద్రవోవ రతికాంతుఁడు తూపులు మూల నైచఁజు
క్కలనడత్రోవ రక్తతరకాంతులఁ జక్కనగా వలాహకం
బులకుఁ గుసుంభచేలము పోలిక రా వెలసెం జగంబు క
న్నులకు వచింపనేరని వినోదముగా ననుసంజ తూర్పునన్. 103.

సీ. హరిహరబ్రహ్మల యాకార మగువేల్పు, వేదత్రయీస్వరూపోదయుండు
ఘూకైకదృష్టిసంకోచప్రదకరుండు, కోకకాంతలపుణ్యకోరకంబు
పద్మినీకాంతకుఁ బ్రమద మిచ్చుబొజుంగు, పంద్రెండురూపులఁ బ్రబలుజాణ
కాలచక్రముఁ ద్రిప్పఁగలవేల్పు గలఱేఁడు, గగనలక్ష్మికి వింతగలుగుతొడవు

గీ. ఏకచక్రరథంబున నేగుజోదు, చీఁకటులగొంగ కలువలసిరికి దొంగ
వేవెలుంగులదొర ప్రభవించె లోక, బాంధవుం డనూనసప్తసైంధవుండు. 104.

చ. తననిసి నేఁచఁబో నిరులు దయ్యముఁ దాన వదల్చి దాని ప
ద్మినివిరులం దళిచ్ఛలము మీఁజఁబగం దగిలించి లేచి షో
యినకళి కోపరక్తినలి నీంద్రకరాహతిఁ గ్రాఁగి వెల్లనై
మునిఁగె నపత్రపం దుదకు మూఁడినయాపద వార్ధిలోపలన్. 105.

సీ. నసిన కుట్మలసోయానమ్ములైనమధువ్రతములు లేచి శుభధ్వనములు సేయఁ
బటులఁ గూడినజక్కవలు విలాసరసంబుతోఁ గృతజ్ఞతమై నెదుర్కొనఁగఁ
జేదోయి నొదల జేర్చి భక్తులు శుభస్తుతులు వాడుచు నమస్కృతులు సేయ
వారాంగనానురాగారూఢి పగిది నస్థిరమైన నీరెండ దెసలఁ బ్రాఁక
గీ. సొక్కుతేజినిగట్టి రయోద్ధతముగ, నొంటికాత్తేరు పిచ్చుకకుంటు దోల
హస్తభూధరసందర్శనైకదృష్టి, భాస్కరుఁడు మింటితెన్నునబైలు వెడలె. 106.

సీ. పద్మరాగప్రభాపటలిచేఁ బూయంగఁబడినపోలిక నొప్పెఁబర్వతములు
అరుణపల్లవచయవ్యాప్తంబులైనట్టి, పగిదిఁ బెంపెసలారెఁబాదపములు
రక్తచందనసమాసక్తనీరంబుల, నియతిగాఁ దనరారె నిర్ఝరములు
శోణాంబరగ్రామశోభాయమానంబులైనభాతిఁ దనర్చె నఖిలదిశలు
గీ. తపనునారాధనము చేయఁదగినవస్తు, వులను సమకూర్చుకొనియె నీభూపురంధ్రి
యనఁగఁ దనరారెనివియన్నియును దలంపఁ, బ్రబలి నీరెండఁదిక్కులబలియుకొలఁది

వ. ఇట్లు జగద్బాంధవుండు సర్వలోచనానందకరంబుగా వెడలుటయు సర్వార్థ
సిద్ధుండును. 108.

క. దండంబుఁ గావిచేల క, మండలువుం దైవమహిమ మార్గంబునయుం
దుండం గని తనకై సురతండము పంపె నని పూని దాల్చి కడఁకన్. 109.

చ. వెడలిన చిత్రభాను రుచివీచిపరంపర మేనిపై వెసం
బడుటకు గాని తద్గిరికిఁ బార్శ్వమునుండియు రాజువీటికై
యడవిఁ బట్టి యేకపది నాగయుచుం గని వీకు సొచ్చి దో
సెఁడు యవలుగ్రహించె నొక యింటిక యేగి సముద్రకంబుగన్. 110.

సీ. సగంచు నెటిమించుచల్వపల్వలు దాల్చ్చ, లలితమగు కావిశాటులు ధరించెఁ
బైఁడిపాత్రికలందుఁబరమాన్నము భుజించు, రారాజుమాధుకరంబు గుడిచె
దూదిపాన్పులమీఁదఁదూఁగుటర్యెలనూఁగు, భోగి తృణాంకురంబుల శయించెఁ
బొఁపాను క్రొత్తపూఁబొదరిండ్ల విహరించు, భాగ్యశాలి యరణ్యపటలిఁదిరిగె

గీ. నెండకన్నును వానకన్నెఱుఁగ కుండ, రత్నసౌధంబులఁ జరించు రాచకన్న
శీతవాతాతపంబులఁ బాలఁ బడుచు, నడుగుజడదారిఁ దయఁ జాపగిఁ దిరిగె. 111.

వ. ఇట్లు సన్న్యాసిని యై ప్రతిదినంబును రాజగృహపురంబునకుం బోయి యొక్కొక్క గృహంబున యాయావరంబుఁ గొనుచు రత్నగిరిగుహాముఖంబున వసియించుచున్నంత నటఁ గపిలవస్తుపురంబున. 112.

గీ. తన్ను వంచించి పతి నిశీథమ్మునందు, నెచటి కేఁగుటయును నిద్ర నెఱుఁగనట్టి
సతి యశోధర యెప్పటిచందమునను, వేగుఁబోకకు మేల్కాంచి వెఱఁగుపడుచు.

సీ. జగమెల్ల సుప్రకాశము చేయఁగాఁజాలు, చంద్రుఁ బాసినయాకసంబు మాడ్కిఁ
బనివానితనము తోఁపఁగ బిగించిన రత్నంబు జాఱినవలయంబు గిదిఁ
బ్రతిబింబమును జూపు స్ఫటికమంబు గలిమించు, తళ్కుగోల్పడిన యద్దంబు భాతి
నెంతైన విలువచేయింపింపఁజాలు నీరంబుఁ గోల్పడిన హీరంబు రీతిఁ

గీ. ప్రాణనాథుఁడు లేని తల్పంబు చూచి, కలలు నిక్కములా యంచుఁ దలఁచునాకు
నేఁడె సిద్ధించె నీనాఁటిపాడుకల ఫలం బనుచు నెంచి గుండియల్ జల్లురనఁగ.

క. చెలులఁ బిలిచి యడిగిన వా, రలు మేము నెఱుఁగ మనుడు రమణీమణియు
గ్గల మగుశోకభరంబున, నలమటఁ గొనిమగుడ ధైర్యమంది కడంకన్. 115.

క. మందురలోనికిఁ జని యం, దుం దురగము లేక యుంటఁ దోడ్తోడ నతం
డెందేని జనుట యెఱిఁగెం, బం దారుణదుఃఖభరము పరవశఁ జేయన్. 116.

శా. సంసారంబు పరిత్యజించి యెటకేఁ సన్న్యాసిగాఁబోయె రా
ద్ధంసంబంచును నిశ్చయించుకొని యాయబ్జాక్షి మూర్ఛిల్లె ను
త్తంసీభూతము లైన పూవు లుపకృత్యం బాత్మలో నెంచి మేన్
హింసం జెందక యుండఁ దల్పగతిఁ జెందె న్నేలనల్ప్రక్కలన్ 117.

క. కర్ణాకర్ణికగా నా, కర్ణించిరి పౌరు లెల్లఁ గలగతి సతియా
భ్యర్ణమున నుండ నృపసుత, పూర్ణశశాంకుండు లేచిపోయెన టంచున్ 118

గీ. చంద్రుఁ డస్తావనీభృత్తుఁ జాటువడిన, కాలమున భంగములు గనుపాలకడలి
రీతిగా నల్లకల్లోలమై తనర్చెఁ, గపిలవస్తుపురంబు తత్కాలమందు. 119

వ. పిదపశుద్ధోదనుండును దదువంతంబు సేవకముఖంబుగా విని సహామాత్యపురోహితుండై కుమారాంతఃపురంబు సొచ్చి యచటి కావలివారల నడిగిన వారును గుమారబహిర్గమనంబున కిచ్చెరు వందుచు ని ట్లనిరి. 120.

సీ. కలనైన జంకుహింసలఁ దలంపని వాఁడు, వేఁటాడఁ బోవు నే విపినములకు
నున్న రాజ్యం బేని యును నొల్ల నను వాఁడు, వెడలఁడనే రిపురాజ్య విజయమునకు
సంపద పుమేడల యందు వర్తిలు వాఁడు, వసియించునే రిక్త వసతు లందుఁ
బరిపంద్రములందు మెత్తనిబత్తి గలవాఁడు, గాకుండునే యిన్ని గాత్రములకును

గీ. నను మఁ బలుప పతిమల నాడుకొనుచుఁ బొలఁగుక న్నీరు పెక్కు కాల్వలుగ పాఱ
కరధృతఖలీన మగు కంటకంబుఁ జూచి, పౌరులందఱు సొక పెట్టి బారు మనిరి.

వ. అంత నారాజపుత్రసహితం బగు కంటకంబు రాక యొకరి నొకరంబున నాక
రు విని. 130.

గీ. వెనుక రాఘవు నడచి కనిపించినట్టి, స్వంపనము వెంట సాకేత జనము వగిచె
రాజపుత్రకుఁ డేమాయె రా యటంచు, నడుగుచును సాగి వెను వెంటఁబడిరి జనులు.

గీ. ఏరికేనియు నపకార మెన్నఁడేని, జేయఁ దలఁపేనిఁ బుట్టని సిద్ధమూర్తి
దేవతాసన్నిభుండు వర్ధిష్ణు వతని, నెచట వసియింపఁజేసితి వేమి చెపుమ. 132.

మ. అనుచుం దన్నతితంద్రమై నడుగువారానీకముం జూచి హా
యనుచుం జెన్నుఁడు గద్గదస్వరముతో దైన్యమ్మున న్మాట తొట్రిల్లఁగా
మనరాచూలియె కంటకంబు గృహిధర్మంబు న్ననుం గూడ వీ
డెను దాఁ జీమలు తూఱరాని వనవాటిం గ్రూరచిత్తంబునన్. 133.

ఉ. నావుడు నెట్టకేలకు మనంబులు క్రుంగఁగ వాని పల్కు ల
ట్టే వినినట్టి పౌరులు పెల్లి మనస్ హృదయంబు వ్రయ్యలై
పోవఁగ మూర్ఛ చెంది పడిపోయిరి తక్కినపౌరు లట్లు హా
పోవుచు వాని వెంటఁ బడిపోయిరి శూన్యత గేంద్రియంబుగన్. 134.

ఉ. ఎచ్చోటు రాజసూతి వసియించిన దయ్యదియే పురంబు నీ
మ్మెచ్చుట రాజసూతి వసియింపని దయ్యదియే వనమ్ము మా
కెచ్చట నుండెనో యిచటికే చెవ పోయెద మంచు వేడ్కఁగాఁ
జొచ్చిరి దారి కడ్డముగుచు న్మతిలేనిగతిం దురంగముల్. 135.

వ. ఇట్లు సముద్రంబు వెల్లివిరిసినగతిఁ దండోపతండంబులుగా నిండినపౌరమండలం
బెడ మీకయుండు రాజమార్గంబునం బోవుచుండ గవాక్షమార్గంబులు తెఱచి. 136.

మ. జననిం బాసినవాఁడుఁ గోలెఁ గడువాత్సల్యంబుతో నెత్తి పెం
చిన యారెండపరాజపత్నియు సితాంశుచ్ఛిన్నమై పడ్డ నే
యనఁటిం బోలెఁ బడెం గుమారవిరహాయాసంబుచే నంగకం
పనకం గూడికలేనిభావుకగతిం బత్నాయమంచు నాపోవుచున్. 144.

గీ. తొలఁకుఁగన్నీరు గలవాలిందుకలయాగ్ని, నలకతమున నాడాచ నగరి నపుడు
వానచినుకులు రేకుల పైన జాఱు, తమ్మిపూ వన్నకోమలి చందమునఁ బొలిచె.

చ. ఎడమతి చంద్రికరంబు లయి వృత్తము లై పొలుకంద గట్టిక
న్నడనికరంబులున్ నగలు బాసిన వేళులు గల్లు చేతులం
దడఁబడ ఱొమ్ము బాఁదుకొను తామరసాక్షుల రీతిఁ జూడఁ జొ
ప్పడెఁ బవమానధూతనిజపల్లవతాడితవల్లికాకృతిన్. 146.

గీ. మారుతాహతికమలకుట్మలరోయాన, చక్రమిథునంబు లైనని కుచ... లట్లు
పరఁగి రిరుగేల ఱొమ్ములు బాఁదుకొనుచుఁ, గపులుచన వనిత... లప్పుడు

వ. ఇట్లంతిపురివారందఱు నెందురుచుఁ జింతాక్రాంతలై మందిరంబులు విడిచి మందురకడ కరుదెంచి కంటకంబుం జెన్నునిం గాంచి పరిపరివిధములఁ గుమారునివృత్తాంతం బడుగుచున్నంత నాయశోధరయు. 148.

సీ. కుచములమీఁదికుంకుమపూఁత బురదగాఁ, గరఁగించి కన్నీరుఁ గాల్వ గట్ట
నిష్కారణక్రోధనిర్వాహకము లైన, కొలికికన్నులు నల్లగ గ్రుమ్మరింప
వెనుదీయఁ గారాని వేఁడినిట్టూర్పుల, వలుదచన్నుందోయి వడఁదోఁప
బొంగుపొంగుగ వచ్చుపొరలు వల్వనివంత, గదియించుకొంత గద్గదిక జూప

గీ. గంపమునఁ గాలుచేయి గగ్గపడ వణంక, నిముసమైనను నొకచోట నిలువలేక
కాంత లందఱు విలపించు కడకు వచ్చి, కంటకముఁ గాంచి యిట్లనెఁ గరుణ మొలుక.

గీ. ఒడలెఱుంగని నిద్రలో నున్నవేళ, జనియె నాప్రాణనాథుండు నను మొఱంగి
యీవుఁ జెన్నుండువచ్చితి రేలరాఁడు, నాప్రియుఁడు చెప్పుమమ్మ కంటకముకాన.

చం. నడినిశఁ బాన్పుమీఁదఁ గరుణామయుఁడై నిదురించువాని రా
బుడుతను బుద్ధిలేక డవి పోకలపాలొనరించి వచ్చి యీయం
బుడిబుడియేడ్పు లేడ్చుచును బొంపిరిపోవు విచారమున్నత
త్తడివలె నిత్తఱిం బ్రతిదినంబును బొత్తున మోపపుత్తువే. 151.

క. పతియెడ విశ్వాసముగల, మతిగలదాన వని నిన్ను మన్నించితి దు
ర్గతి నెచటికిఁ బంపినఁ, గతియును నాతోడఁ జెప్పఁగదవే వాజీ. 152.

క. పలికింపకు కన్నీ రిడకఁ, గటింపకు నీదుకోర్కె పండెం గద నా
యకు నెడఁబా వింతటి కంటకమా నామీఁద నక్కటా కంటకమా. 153.

గీ. తెలివిలేని స్నేహితులు గల్గుటయు కంటెఁ, దెలివిగల్గు శత్రుకులము మేలు
మిత్రరూప మైన శత్రుఁడ వై శాక్య, వంశ మంతరింప వచ్చితీవు. 154.

చ. అపరిమితబాష్పపాతగమితారుణభావము లైన కన్నులన్
దవణము లుజ్జగించి సుమదాణకుఁ బాసిన మేనుఁ గల్గుసి
యువిదలు నీకతంబున నలో యని యేడ్చుచు భర్త యుండియున్
ధవుఁడు గతించియుండిన యనాథలచందముఁ బొందిరర్వమా. 155

చ. పగటిమి లేనియీ తెలివిమాలినకృత్యముఁ జేసి యిప్పు డి
ప్పగిది నరేంద్రసద్మము దువన్ సరలించిన నేమిలాభ ము
ష్మగలవిభూషణంబు ధృతిమంతుని దోడ్కొనిపోవు వేళ నీ
దగడలు కూలిపోయెనె తదా సకిలించిన మేము లేపమే. 156.

కం. తెఱవలుఁ బరిచారకులం, దొఱుఁ గూర్కిన వేళ నామనోరథమును నె
ప్పరిశెంచి ముచ్చిలఁగ నే, ద్రైణ నీపది కెట్లు సంఘటిల్లెను బాజా. 157.

క. అని యిట్లు గుణ్ణముం గని, కనికర ముట్టిపడఁ బల్కఁగాఁ జెన్నుం డ
వ్వనితామణితో నిట్లని, వినిపించెం గతము వినయవినమితముఖుఁడై. 158.

గీ. నేను గంటకమ్ము నిందింపఁగాఁ దగ, దమ్మ కేవలము నిరాగసులము
ప్రభువు దెసఁ గృతజ్ఞభావంబు గలవార, మఘముఁ జేయనోప మమ్మ యెపుడు.

క. అద్దయు రాణికడ నా, యుద్ధకు నంచి తేజనొగ్గా టంచున్
ముద్దేవుఁడు పల్కఁగ నే, మొద్దుగతిన్ మాఱుసంద్గిమొ విడనైతిన్. 160.

వ. పదంపడి పలదని నాకుం దోఁచినపల్కులు పల్కినను వినని యమ్మహారాజుశా
సనం బుల్లంఘింపఁ దగ దని యెంచి దైవప్రేరణంజేసి తురంగసం బాయితంబుఁ
గావించితి నదియును విశ్శృంఖలంబుగా ఖురంబులం బుడమి నదల్చినను హేషాస్వనం
బుల నాకాశంబుఁ బూరించినను దడారావంబులు దైవబలంబునం జేసి యెవ్వరికి
నశ్రుతంబులయ్యె నంత నా రాజపుత్త్రుండును. 161.

శా. ఉల్లాసంబునఁ దేజి నెక్కి సుగలో హా హా యంచుఁ బైఁ బుష్పముల్
చల్లన్ నే నొక చెంతఁ బోవఁగ ఖురన్యాసంబు లేకుండ న
ద్యల్లీలం ద్రుటిలోనఁ జేరె నొక గాంధారణ్యదేశంబు నా
తల్లీ యే మని విన్నవింపఁగలఁ దద్దివ్యప్రభావమ్ములన్. 162.

చ. పడి పడి మేనఁ గిల్గు తన బాహుపురుల్ మొదలైన సొమ్ములన్
విదలిచి నా కొసంగి యడవిం జనుచున్నను జూచి పల్కె నే
వడలితి నోరి యింక గృహవర్తనము న్నినుఁ గంటకంబునుం
బదిలము గాఁగఁ బొం డని యొమాటల వెంబడిఁ గన్నులంగుచున్. 163.

వ. అని తదీయ భూషణవ్రాతంబుఁ బైఁబెట్టిన నత్తలోదరు లత్తలపాటుమాని తత్ప్ర
భావంబున కచ్చెరువందుచు సన్న్యస్తుం డయ్యె నని నిశ్చయించి రంతఁ జిరకాల
పరిపోషణానుయాత్రప్రేమావేశంబు మరల్పలేక గౌతమి యను రాజపత్ని యిట్లు
విలపింపం దొడంగె. 164.

ఉ. నీలము లై సమంబు లయి నిగ్గులు దేఱి దళంబు లై పృథ
గ్జాలము లైన నీకురులు కన్నవనందన మంచి గందపుం
దైలము రాచి దువ్వి పువ్వుదండలు దూరిచి మేలు సేయఁగాఁ
బోలును గాని యిప్పగిది ముండనముం బొనరింపఁ బోలునే. 165.

ఉ. మేలిక డానిఁ బోలు నును మేని హొరంగు వెడందఱొమ్ము మో
కాళుల కంటు చేతుల చొకారము సింగమువంటి లావునుం
గీల నడంచు కుత్తుకయు గిత్తకనుంగవ వంటి కన్నులుం
గ్రాలు నరేంద్రసూతి కట రా విధి వ్రాసె వనప్రచారముల్. 166.

గీ. నీవు ప్రోవంగఁ దగిన పున్నెంబు లేమి, వసుధ నిక్కము దురదృష్టవంతురాలు
జగతి నెంతటిపున్నెంబు సలుపకున్నఁ, బ్రజకు దొరకునె నీవంటి రాజకొడుక.

చ. హిమరుచిఁ గేరు గోరులును వృత్తము లై తగు వ్రేళ్లు గూఢగు
ల్ఫములును లేఁత కెంజిగురు వంటి మృదుత్వము నప్పుపాదుతో
సమ మగు నాకృతుల్ గలిగి సర్వనరేంద్రనతంబు లైన పా
దము లివి సహించునే యడవులం దంతురఘోరవనప్రచారముల్. 168.

క. కులమును వయసును రూపును, బలమును దేజమును బాహుపాటవమును లోఁ
దలఁచిన నీడగు నీకుం, గలనైనను భిక్షుమూర్తి గాఁదగునె వయస్యా. 169.

గీ. సర్వశృంగారితం బైన సౌధ మందుఁ, బఱపుగద్దియ మంచంబు పై సుఖించు
రాజసము గల్గునీ మేను నరణ్యమందుఁ, జలికి వానకు నెండకు సైఁచునయ్య.

గీ. అనుచు నెత్తి బిట్టు రోదనముఁ జేయు, గౌతమింగని తక్కిన కాంత లెల్లఁ
దుందిలచ్యవమానమరందబిందు,భరితకుసుమంబు లైనట్టి వ్రతతు లైరి.

గీ. చక్రవాకంబుఁ బాసిన చక్రవాకి, పగిది సారెకు గద్గద స్వరము తోడ
గౌతమీరోదనంబునఁ గడుపు పగిలి, మరల విలపించె నాయశోధరయు మిగుల.

గీ. అగ్నిసాక్షిగఁ బరిణయమాడినట్టి, ధర్మపత్నిని వదలిన తపము తమె
ధర్మమునఁ గామమునఁ దాఁటఁ దగ దటంచుఁ, బలుక రేమున్న పెద్దలు ప్రాణనాథ.

క. మీవంగడంపుఁ దొల్లిటి, భూవరులను వినవె రాజ్యమును విడచి యర
ణ్యావాసముఁ జేయంగాఁ, జోవుత జిన్ సతులతోడఁ బోయి రనుటయున్.

శా. శ్రౌతస్మార్తము లైనకర్మముల భార్యాయుక్తుఁ డై గేస్తు దీ
క్షాతంత్రంబు లొనర్పఁ బాడి యని వేదంబుల్ విధింపన్ భవ
చ్చేతం బెట్లు నను త్యజించె గుణరాశీ నాకు రా మానునే
నీతో నుండనియంతమాత్రన భవన్నిష్ఠాతపోలాభముల్. 175.

చం. తెలిసినవాఁడ వౌదువు సుధీమణి వౌదువు ధర్మచింతయుం
గలిగినవాఁడ వౌదువు మనఃప్రియకృత్యుఁడ వౌదు వైన నా
తలఁపునఁ గల్గుసందియము దాఁపక చెప్పెద నింద్రలోకమం
దలి విరిబోండ్లచెల్వముఁ గనం జనినాఁడవు ప్రాణనాయకా. 176.

గీ. అప్సరస్త్రీల సౌందర్యమరయ నింద్ర, లోక మేగితి వంచు నాలోచనంబుఁ
బూనఁ దగి దేల యన ఘోరలైన నస్మదాదివనితలకంటె సౌందర్యవతులె.

క. తపమున కేగితి వను నొక, నెపమున నీయెడ విచారణీయంబు చిరా
దుపచిత మగునాయందలి కృపయుం బేర్మియును నేవగింపం దగమే.

క. త్రిదివోపభోగముల నాఁ, కుదిఁ గోరంబోదు సుఖమార్గం బగుటన్
బదివేలకుఁ గోరెద నీ, ముదిత నగుట నెన్నిజన్మముల కేని సఖా. 179.

సీ. తమ్మిపూరేకుచందము గల్గి చెవి దాఁకు, వెడఁదకన్నులఁబోయి బెడఁగు తోడ
నిండుజాబిల్లి వెన్నెలవంటి చిఱునవ్వుఁ, దొలకించు కెమ్మోవి కులుకుతోడఁ
గొనబుచందురుఁబోలెఁ గొమరారు మెదురైన, చదుగు గల్గిన సొగసుదురుతోడఁ
గెందమ్మిదగు టెక్కెమి చెల్వమును బిల్వ, సాగు మానాఁగుమీసములతోడఁ

గీ. జక్కదనమున కెక్కైన యొంచంద్రబింబ, మునకు సహపాఠి యైననీమొగము నింకఁ
బడయ నేరని పరమని ర్భాగ్యురాలి, తనము సేయునె దయమాలి తమ్మిచూలి.

ఉ. భాసురశీలునిన్ మగని భావజతుల్యకళాసరూపవి
న్యాసుని బాసి యీసరణి నాకు ఘటించిన శోకవహ్నిచేం
బాసటఁ గాఁగ నామనము వ్రయ్యలు గాక మఱింతఁ గాలఁగాఁ
జేసెను రాతనో యినుము చేతనొ ధాత పదానుపేక్షఁ దై. 181.

మ. అనుచున్ మూర్ఛిలు నేడ్చుఁ బ్రేలు వితతా యాసంబునం బొక్కు హా
యనుఁ గట్టా మగఁబారిచెం గరుణ లేదా యంచు యోజించు న
న్ననదం జేసితె దైవమా యను దయా స్వాంతుండు గా కెంతలో
మనముం ద్రిప్పఁగ నేర్చె నో యను మహా త్మా క్రోధరాదా యనున్. 182.

చ. కలికితనంబుఁ బాసి యిటు కంటికి మంటికి నేకధారఁ గాఁ
గలవర మందుచున్న నృప కాంతను గన్గొని చెంతనున్న కాం
తలును మఱింత గద్గదఘ నంబుగ నూరడఁ బల్కి రేడ్చుచున్
దొలకరివాన తాఁకుఁ గని తూలినతమ్ములఁబోలు మోములన్. 183.

ఉ. ఓదన మజ్జగించి దగ యున్ విడనాడి సుతుండు రాఁగ శు
ద్ధోదనుఁ డెంతయుం జపము హోమము సేయుచు దేవళంబునం
గాదిలిచూలి రాక తన కంటకముం దనసాది నింటికిం
బోఁదరలించె నన్ననుడి పొల్పఱుచు న్వని నేలమూర్ఛిలెన్. 184.

వ. ఇట్లు మూర్ఛిల్లి కొంతతడవునకుఁ దెప్పిరిలి యొనర్చుచున్న పూజాపురస్కారం
బులుమఱచి చింతాక్రాంతకాంతాశతయుతంబుగఁ గంటకంబుం జెన్నొందు
నన్న చోటికింబరివారపరివృతంబుగఁ జని యాచెన్నునివలనఁ గలతెఱం
గెఱింగి దైవవశంబునకుఁ జింతించుచు వంశక్షయంబునకు వందురు చున్నంత
నాకాశవాణివలన యశోధరాగర్భంబున నొక సుతుం డుదయింపఁగలఁ డను
పలుకు జీవితాశం బుట్టింపఁ దత్కాలంబు ప్రతీక్షించుచుఁ గపిలవస్తుపురంబున
నుండె నచట రాజగృహపురంబున. 185.

చ. ప్రతిదినమట్లు భిక్షకయి వచ్చుయతీంద్రు మహానుభావయో
గ్యతలను శారకామినుల కందఱికిం దగఁ దెల్పి ధ్యానని

ష్ఠిత గుణిచూపు నేత్రములసౌష్ఠవముం భగవద్ఘనాంశర
క్షిత నవకోచిరాగమవిశిష్టమనోహరవక్త్రభాగముల్. 186.

ఉ. నాటికిఁ గన్నులర్ధుకొని చాఁగిలి మ్రొక్కుచుఁ డటంచుఁ బుత్రులం
బోటులు కొంద ఱంపి యతిపుంగవునిం బ్రణమింపఁజేతు రే
నాఁటికిఁ జేటు రాకునికి నారులు కొంద ఱొసంగుచుందు ర
ప్పేటికి వచ్చువేళఁ గను పెట్టి తమంతటఁ దాము బిచ్చముల్. 187.

మ. పురకన్యల్ తము నెట్టిప్రాయపు రూపు ల్వచ్చి కాంక్షించినన్
జిరకాలంబుననుండి డెందమున గా చెల్వంబు సంధింప ర
త్నిరు బిచ్చమ్మున కప్పురిం దిరుగు శాంతీధారునిం జూచి సుం
దరుఁ డంచుం బతిఁగాఁ దలంతు రట తత్సౌందర్య మింతింతయే. 188.

శా. బత్తిం బెంపునఁ జేర్చి గౌరవమునం బల్మాఱుఁ దన్నుం దదా
యత్తత్వంబునఁ బూజసేయు పురకన్యాసంఘముం జూచి త
చ్చిత్తం బేకగతిం జలింపకయ భాసిల్లుం జగద్వంద్యసం
పత్తిం బొంకుట కేమియబ్బురము తద్వైరాగ్యధారాలతల్. 189.

క. ప్రత్యహ మీతెఱఁగునఁ దత్రత్య చిరంటీజనైకదత్తయశగ్రా
సాత్యంతపారితుష్ట్యత్యుత్సుకుం డై మరల రత్నగిరిదరి కరుగున్. 190.

సీ. ఆశనాయ నిరసించి యాహారములు త్యజించి శరీరము కృశింపఁ జేయువారు
రక్తమాంసంబుల రహించు దేహ మాత్మకు విరోధియటంచుఁ దలఁచువారు
మనమున నెద్దియో మనన చేసెడిభంగిఁ దెలుపు దైన్యంబునఁ దొలఁగువారు
మాంస మజ్జానసంపత్తి కై బాధింపఁ దగినవస్తువటంచు బొగులువారు

గీ. నైనయోగులఁ గొందఱి నవనిధరద రీముఖంబుల నుండువారిని మహాత్ము
లైనవారినిఁ గనియె నొకవ్వ డచట నట్టిటుఁ జరించు శుద్ధోదనాత్మజుండు.

క. అవయవములు కృశియింపం జివికినకీల్గోలయ రెండు చేతులు జోడిం
చి వినుదెస మొగం బగుయోగివరులఁ గనుఁగొనియె నొండు కెలన నతఁ డొగిన్.

సీ. వ్రేళులు మడఁచి కేల్బిగియింప నఖచేత గోళ్లుఁదూఱిన వారు కొంద ఱాయ
సము లైననూఁదుల నమరు పావాల పై నడుగుల నెలకొల్పి నడుచువారు
కొందఱు వాఁడిరాల్గాని ముఖోరురూరస్థస్థలముల వొందికొని గాయములు సేసి
కొనువారు కొందఱు గొంతునఁ బాములఁ దగిలించుకొని కేళి నెగడువారు

గీ. కొందఱు స్మశాన మందున్న • శవవసనంపుఁ, బేలికల మెడధరియించి • ప్రేనుఁగులను
జేతు లరచాఁచి కౌఁగిలిం • చికొనువారు, కొంద ఱెదురైరి యారాజ • నందనునకు.

వ. మఱియుం గాయమ్ములఁ గంటకంబులు గ్రుచ్చుకొనువారును శివశివా యని యఱచువారును దంతులమ్ములు జొన్నలు మొదలగు పదార్థమ్ములఁ జేఁ దగనివి పత్రములతోఁ గలపి తినువారును నయనమ్ములఁ గంటకంబులఁ బొడిచికొనువారును నాలుకలు తెగఁగోసికొనువారును గాళులు బంధించుకొనువారును గర్ణంబులకుం జెవిటితన మాపాదించుకొనువారు నైనయోగుల ననేకులఁ గాంచి డెందం బాశ్చర్యరస నిమగ్నం బగుడు నికటమ్మునకుం జని యం దొకవృద్ధుం గాంచి సర్వార్థసిద్ధుం డి ట్లనియె. 194.

మ. బహుకాలమ్మునుండి యీగిరిదరీ • భాగంబులందుండి స
న్నహనంబుం బొనరించుచుంటి ఘనవి • జ్ఞానాప్తి కై మీరు నీ
గుహలో దేహము గాసిపెట్టుటయుఁ గ • న్గొందు న్మునీంద్రా మనం
బహహా నొందఁగఁ జేయుచున్న విట మీ • యారబ్ధ దుష్కృత్యముల్. 195.

క. మానవదేహము కడుదుః ఖానుభవం బనుభవింప • నగునది మీర
ద్దాని మఱియింత దుఃఖర,సానుగత మొనర్పఁ బాడి • యగునె మహాత్మా. 196.

క. అని పల్కిన సిద్ధార్థునిఁ, గని తన్ముఖరోచిరాప్తిఁ • గనుఁగొనుచు మహా
త్మునిఁగా నెఱింగి యిట్లని,యెను మెల్లన యోగివరుఁడు • మృదువచనములన్.

ఉ. ఇట్టి శరీరము న్నిగుల • నీగతిఁ గష్టముపాలుసేయుటం
బట్టి పరంబున న్నరక • బాధల నన్ని సహింపవచ్చు నాఁ
డట్టి ప్రయాసము ల్మనకు • నబ్బఁగఁ జేసెడి వేల్పు లబ్బురం
బుట్టిపడంగ నేఁడ మన కొయ్యన • నిత్తురు పుణ్యలోకముల్. 198.

క. బాధించినఁ గాయము వడు, బాధలు మానవుల పాప • పటలం బడఁచున్
బాధ యనుకొనవిఁ బడిన సు,ఖాధికలోకముల కాత్మ • యరుగుం బిదపన్. 199.

గీ. అనుచు మామతసిద్ధాంత • మదియె మేము, నాచరించుచు నున్నార • మనఁగ రాజ
నందనుఁడు కటకటఁబడి • నగుచు యోగి,వరున కి ట్లనె దత్త్వంబుఁ • గఱప నెంచి.

మ. వెలకుం గొన్నపదార్థ మెయ్యదియు ను • ర్వింం దగ్గిపోకుండ దీ
రలు ప్వర్గమ్మును దేహకష్ట మనుప • ద్రవ్యమ్ముచేఁ గొన్నఁ ద

త్ఫల మెల్ల నవ్యయ మైనచో మరలనే తత్ప్రాప్తిచే దుఃఖభా
క్కులు గాకుందురె సర్వరంబు లగుకోర్కుల్ దీరఁగాఁ జెల్లునే. 201.

సీ. యోగీంద్ర యెవ్వఁడే నూర్ధ్వలోకంబులు, ప్రాపించు మనుజుఁడు పడక మానఁ
డిందులకై యేను దృష్టాంత మొక్కటి, వాక్రుత్తు నవధారు వార్ధిలోని
సలిలసంతయును బాష్పస్వరూపమున నూర్ధ్వంబున కేగ మేఘంబటంద్రు
దానినే కద గాలి తాఁకుచే నదియ చెల్లాచెద రగుచు జలముగఁ బుడమి

గీ. మీఁదఁ బడి కాలువగట్టు చుమిట్టు పల్లమేకముగఁజేసి బురదతో నేకభావ
ముంది వారాశిలోనిక యరుగు పగిది, నూర్ధ్వగామికి స్వస్థాన మొదవు మరల.

సీ. అనవిని యోగి యిట్లనియె మహాత్మ నీ, వనినసంగతి నిజమానొ యేమొ
నేనెఱుంగను మాకు నిశ్చయజ్ఞానంబు, లేమి నిట్లయితిమి మే మయినను
గుదికట్టువలె నాత్మకును బై కెగిరిపోవ, నీకుండఁ బ్రతిబంధ మెసఁగఁ జేయు
నీశరీరము మాకు నిష్టంబురాత్రి పో, యినవెన్కఁ బవలు వచ్చినవిధమున

గీ. రోద చనినమీఁద నిశ్శబ్ద మొదవు పగిది, దేహ మీరీతి మిగుల బాధింతు మేని
గట్టిమెడలి పదపడి సుఖంబ యాత్మ, కొదవు నని మాయభిప్రాయ మిది నిజంబు.

మ. అని యోగీంద్రుఁడు వల్కుపల్కులను సిద్ధార్థుండు యోజించి యి
ట్లనియె న్నీ రనినట్టి సౌఖ్య మదియు న్నాంతం బగున్ లక్ష్యహా
యనము ల్పోయినఁ బోవుఁగాక యెపుడే నంతంబు లేకుండు దా
నిని లోకంబునఁ జెందు వా రలిగిరే నిం జెప్పఁడా యొప్పగన్. 204.

వ. అనుడుఁ బరమాత్మ యొక్కండు సర్వరుండు గాఁడనియుఁ దదానందం బొక్కటి శాశ్వతం బనియుఁ దదితరమ్ములు సాంతమ్ము లనియు నొడివిన జడదారి కమ్మ యాదేవేయుం డి ట్లనియె. 205.

మ. అకటా యోగివరేణ్య తెల్వియును ధైర్యమ్ము న్పవిత్రత్వముం
బ్రకటత్వంబును గల్గుమీర లిటు స్వస్వప్రాయ మై యస్థిరా
త్మకమై యొప్పు సుఖ మ్ముఁ గోరి పరత త్త్వజ్ఞాన సంపత్తిసా
ధకమై యొప్పు శరీరముం బ్రబలబాధాయుక్తిఁ గారింతురే. 206.

గీ. ఆత్మయందలి పేర్మి దేహమ్మునందుఁ, గల యనిష్టత్వ మీరీతిఁ గానెనర్చుఁ
గావి మోక్షవయాత్రకుఁ గారణంబు, దేహ మెడలిన దత్త్వంబుఁ దెలియఁగలరె.

క. ఈదేహం బీయాత్మకు, నేదియు నొక కారణమున నిల్లై యుండె
న్నీఁద నిఁకఁ నొక్కయింటం, బ్రోదియొనర్చుటకుఁ గూలఁ ద్రోతురె దీనిన్. 208.

వ. అని యుపదేశించిన యారాజపుత్రున కాయోగు లిట్లనిరి. 209.

క. ఈమార్గము మంచిది యని, యే మవలంబించినార మిది కానియెడన్
నీమదికి న్నచ్చినమతి, యేమార్గం బైనఁ దెల్పు మెఱుక గలిగినన్. 210.

వ. నీకుం దెలియ దేని మిన్నక పొ మ్మనిన సిద్ధార్థుం డచ్చోటువాసి మనమ్మున నిట్లు వితర్కించె. 211.

ఉ. ఏలొకొ వీరు కష్టములు కిల్లగు దేహ మొగిన్ మఱింతక
ష్టాలకుఁ బాలుచేయుటకు సన్నహనం బొనరించుచుండి యీ
కీలక మింతమాత్రఁ బరికింపరు బాధలు పెట్టి దేహముం
గూలఁగఁ ద్రోచి యు న్నతుకఁ గోరెద రక్కట బుద్ధిహీనులై. 212.

సీ. మనుజులసుఖము గన్గొనలేని వేల్పులఁ, జేర్చమె సంతోష పెట్టుకొఱకొ
యిహలోకకష్టమ్ము లెవసి నారకబాధ, లను సహించుట నేర్చు కొనుటకొఱకొ
తనువు చిక్కినతతిఁ దప్పించుకొనిపోవు, టాత్మకు సుఖ మను నాశకొఱకొ
దయలేని తప్పుద్రోఁతల మతగ్రంథంబు, లందుఁ గృతజ్ఞతఁ జెందుకొఱకొ

గీ. తనువులను రోయుచున్నారు తపసు లకట, మీకుఁ గలతెల్వి వీరికి లేకపోయె
వృక్షతక్షులార పువులార పక్షులార, రోయుచున్నారె మీరు మీ కాయములను.

చ. ప్రవిమలచిత్తు లంద్రు పశుపక్షి మృగాదులకంటె సర్వమా
నవులను దేహ మేలొకొ వినాశముచేయఁగరా దటంచు యో
గివరులు డెందమందుఁ బరికింపరు పక్షులపాటి యైన నం
చు వికలచిత్తుఁడై తిరుగుచుం గిరిపై వసియించెఁ బ్రాగ్గతిన్. 214.

చ. వనితయు నచ్చటం గపిలవస్తుపురంబునఁ జాలునిండి వ
ట్టనమునఁ బల్లెలం జను లెడందల సంతసమందుచుండఁగాఁ
దనకు సుతుండు లేనికొఱఁతం దిగద్రావుచు శాక్యవృద్ధుపె
మ్మనమునఁ బొంగ నొక్కనిఁ గుమారునిఁ గాంచె శుభక్రమంబునన్. 215.

గీ. పెద్దయగుపుత్రుఁడీవ్వడు పిన్నయయ్యె, నంచుశుద్ధోదనుఁడు పేర్మిఁ బెంచుచుండఁ
జిన్నబాబిల్లి వితమునఁ బెరుఁగుచుండె, రాహులుం డను పేర నా రాజసుతుఁడు.

### ఆశ్వాసాంతము.

క. పెద్దాడవంశజాత స, ముద్దామ యశస్సమేత•బుధదారిద్రీ
కుద్దాలీభూతసము,ద్యద్దయ కవిమిత్రతిరుప•తంబాపుత్రా. 217

మ. ధరణీదేవకుమార భూవర సము•ద్యద్దాతమిాతీరసు
స్థిరరాజ్యాతిశయా ప్రమోదలహరీ•దేదీప్యమానాశయా
తరుణీసూనశరా ప్రవీరపరకాం•తాసోదరా కీర్తిభా
స్వర కార్తస్వరసన్నిభాపఘనకృ•ష్ణారాయభూమిాశ్వరా. 218.

### విద్యున్మాలావృత్తము.

విద్యాభ్యాసో • పేతశ్రద్ధా
విద్యుత్కాయా • వీతాపాయా
సద్యోమిత్రా • సాధుస్తోత్రా
హృద్యశ్రీయా • కృష్ణారాయా. 219.

### గద్యము.

ఇది ...శ్రీతిరుపతివేంకటేశ్వరప్రణీతం బగుబుద్ధచరిత్రం బనుమహా
ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

# బుద్ధచరిత్రము.

---

## తిరుపతివేంకటీయము.

## చతుర్థాశ్వాసము.

క. కొచ్చెర్లకోటకులసం, పచ్చతుర కవీంద్రచంద్ర వాగమృతలల
ద్ధ్రుచ్చాతక నిర్మలతర, సచ్చరితా కృష్ణరాయ సాధువిధేయా! 1.

వ. అవధరింపు మనంతరంబ. 2.

ఉ. రాజగృహాభిధాననగరంబుఁ గరంబు స్వధర్మపద్ధతిం
దేజము తప్పకుండ నవనీపతి యై తగుబింబిసారుఁ డెం
తే జనము ల్నుతింప లలి నేలుచు నుండెఁ గులీను లైనరా
రాజులమాడ్కి మంత్రులు తిరమ్ముగ సుస్థితి దెల్పుచుండఁగన్. 3.

గీ. రత్నగిరికందరమ్మున రాజపుత్రుఁ, డొకఁడు రాజ్యమ్ము విడిచి భిక్షుకునిపగిది
నణఁగి యున్నాఁడతండు మహానుభావుఁ, డనియెడువదంతి రాజగృహమునఁ బ్రబలె.

చ. అనద యొకర్తు తన్నగరమందు వసించుచునుండు దానికిం
దనుజుఁ డొకండు వాఁ డుపవనంబునఁ గ్రుమ్మరువాఁడు చిల్వకా
టునకు గతాసుఁ డై చనినటు ల్చెలికాండ్రు రయంబ యేగి య
వ్వనితకుఁ దెల్పి రావె పెనువంత మరల్పఁగలేక యెంతయున్. 5.

గీ. కొడుకు పాముకతనఁ గూలనచ్చోటుఁ జేరఁ, బోయి నోరు వెత్తి మోఁదుకొనుచు
నన్ను విడిచిపోతె నాకులాధారంబ, నాతనూజ యని మనమునఁ బొగిలి. 6.

వ. వెండియు దురంతచింతాభరం బాపలేక యప్పాపనిసబంబుపైఁ బడి యిట్లు
విలపించె. 7.

చ. కటకట! యెన్నఁ డేని నొకకష్ట మెఱుంగక నీవు నాకుఁ గ
ల్గుటకు ననేకదైవములఁ గొల్చి జగమ్ములు మెచ్చఁ గంటి నీ
చిటిపొటిమేను గాఁడఁ గఱచెం బెనుభూతము పోలె నెంత య
క్కటికము లేకపోయెఁ గొడుకా కడ కెక్కడి కాలసర్పమో. 8.

గీ. తోడి బాలురతోఁ గూడి నేఁడు వేర్చిఁ, గేళిమై నున్న వేళ నిన్నేల కఱచె
నట్టనడి పూలతోఁట ఫణాధరంబు, పాము గాదది నాపాలి బాము గాని. 9.

క. కొడుకు కళేబరముపయిం, బడి యిటు లెల్గెత్తి యేడ్చు పడఁతిం గనఁగాఁ
దడఁబాటునఁ జనుదెంచిరి, వడివడి నాయిరుగుపొరుగు వాడజనంబుల్. 10.

సీ. గొణగొణ వేదిరో గొణఁగుచుఁ గేలుసారించి మార్జనులమంత్రించువారు
విషమువో మందులు విషవస్తువులె యంచు, నూటి కల్మము కంటఁ గూరువారు
వనపత్రములు దెచ్చి పసరు గిన్నెలఁ దీసి, ముకుఁజెవుల నొకింత పోయువారు
పురవైద్యశాలకు నరిగి భేషజనీకములు దెచ్చి నిశ్రమున నొసఁగువారు

గీ. ఎచటి ప్రాణము! లేచిపోయినదటంచు, నొరులకొరులకుఁ దెలుపు చవిటిచికొనుచుఁ
దుటదుట స్రవించు కన్నీరు దుడిచికొనుచు, నరుగువారును నైరి తత్పురజనంబు.

వ. ఇట్లనేకు లనేకప్రకారమ్ముల విషనివర్తనోపాయమ్ము లాలోచించి యొనర్చుచు మృతపుత్త్ర యగునాయమ్మ నోదార్చు చున్నంత మఱికొందఱు. 12.

క. ఈనగర సమీపార, ణ్యాని ప్రత్నగిరికందరాంతరమున స
న్న్యాసానుభావుఁ డొక్కయ, తీనుం డున్నాఁ డతం డతీంద్రియుఁ డెందున్.

క. ఆయనయొద్దకు నీమృతకాయము గొని పొమ్మ తండు కరుణాభరణుం
డాయువు నొసంగ సమర్థుఁ డుపాయం బిది యనుచుఁ దెలుప నాపెయుఁ గడఁకన్.

### కపిరాజ విరాజితము.

బుజముపయి న్మృతపుత్త్రకళేబరముం దగ బర్వున మోయుచు నే
న్గజగజలాడఁగఁ గన్నుల బాష్పపుఁ గాల్వలు ఘోరునఁ గాఱఁగ న
క్కజ మెద నించువికారమునం గొడుకా కొడుకా కొడుకా యనుచుం
గుజముల నీడలకుం జనుచుం జనెఁ గూరినవంత దిగుల్వడుచున్. 15.

సీ. కుసుమపేశల మైన వసిపాపమూఁపుపై, జలజలఁ గన్నీరు జార్చుదాని
నిట నన్ను విడిచి నీ వేగితే హాపుత్త్ర, హాపుత్త్ర యంచు బిట్టడలుదాని
పాపఫలము ఫణాధర మై నిన్నుఁ గఱచెరా కొడుక యం చొఱలుదాని
నపకార మేమి నే నాచరించితి మాల, దేవుని కని సారె దిట్టుదాని

గీ. నాసుతుని బ్రతికించు పుణ్యప్రచారుఁ, జెప్పఁగదరమ్మ వేగ వెం చెట్టులార
యనుచు నాపౌరాణసంబుల నడుగుదానిఁ గని యొపి సిద్ధార్థుఁ డెంతయుఁ గరుణ మొలయ.

పోవలె నంచు మార్వచన•ముల్వచియింపక యేగు గొల్లలం
గావి మెఱుంగు కన్గొనల•గ్రమ్మఁగ శాక్యకులీనుఁ డిట్లనెన్. 34.

క. ఏనును వచ్చెద నిల్వుం, డానరపాలకునిపాలి•కనుచుం గూడం
దాన మెడమీఁద నిడుకొని, పైనం బై చనియె గొల్ల•వాండ్రకపిఱుందన్.

క. చనిచని సాయమ్ముఖమున, కు నగరమున కజపటలియుఁ•గొల్లలపిండుం
దనయుండఱ నడువఁగ నెం, య్యనిఁ జనియెం బౌరులెల్ల•నచ్చెరుపొందన్. 36.

ఉ. మేఁకలపిండుతోఁ జెఱుత•మేఁక నొకండు భుజద్వయాభిధా
నోకహశాఖికాయుగళి•నూల్కొనఁజేసి పురంబుఁజేరుతం
ద్రాక్పతికి న్యతీంద్రునకు•ద్వారని పానుల దారి యిచ్చి రా
ఘాకకు నెత్తిగిల్లె శక•టంబుల రాజపథంబు చెంతకున్. 37.

లయగ్రాహి.—అమ్ముని రయమ్మునఁ బురమ్మునకుఁ జొచ్చు
తమ్మగువిధమ్మునఁ బథమ్మునఁ జనంబో
నమ్మికొను కోమటిజనమ్ములు మనమ్ముల ఘ
నమ్మగుచు నచ్చెరువు గ్రమ్మఁగఁ దులాదం
డమ్ముల త్యజించిరి ముదమ్మలరఁగాఁ గ్రయిక
లమ్మగిఁ బడంబడుచుఁ దమ్ముఁ దమవారల్
తెమ్మనిన వస్తునికరమ్ములను గైకొనిగ్రి
హమ్ములకుఁ బోరు వికలమ్మయినబుద్ధిన్. 38.

సీ. సామితక్షితదారు•సన్నద్ధమైనచే, బాడిత తివియక•చూడ నేగఁ
దక్షు డయ్యాతివరుఁ; •దంతుపాయుండు మగ్గము వెట్టి తురిలోనఁ•గండెలునిచి
తగ నేసికొనుచు నో•తప్రోతముల నవధరించి వేమున ఘ•ట్టించుకొనుచు
మగ్గమ్ము విడిచి య•మ్మహనీయుఁ గన్గొన, నరిగెను ; పశ్యతో•హరుఁడు పైఁడి

గీ. తీవ కమ్మచ్చు పటకార్లు•దిగవిడిచియు, తీంద్రు సాక్షాత్కరింపఁ బో•యెను గులాలుఁ
డొక్కకరమునఁ గూటుమిం•కొక్కకేలఁ, బచ్చిపంటియు ధరియించి•వరుగు వెట్టె.

గీ. ధాన్యముమ్మెడిపం రద్భు•తమ్ము గాఁగ, నచటఁబోసినరాసుల•నచట డించి
భిక్షుకుని జూడనేగ వాఁ•డెయ్య లేగి, పట్టి తినఁజొచ్చె నిష్ప్రతి•బంధకముగ 40.

గీ. సుత్తి యెత్తినతనచేయి•సుత్తి యొత్తి, నట్టె యుండఁగఁ గమ్మరి•యతనిఁ జూచె
ధనము లెక్కించుకొనుచు న•త్తపసిఁగాంచి, లెక్కమఱచెను వైశ్యకులీనుఁ డొకఁడు.

గీ. పశువు నశియింపఁజేయు నిప్పగిదిఁ బల్కి, నటుక ఁబోవుటవవ్వలవరసి వే
నరపతిసమీపమునకేగి నటుక నీకు, నయ్యా యని కేకవైచె సిద్ధార్థుఁ డపుడు. 49.

వ. ఇట్లొనర్చి సమీపమ్మున కరిగి యప్పశుపాలం గాంచి విస్మయమయుఁలై యూరకచూచుచున్న ఋత్విక్కులం గాంచి మృదుమధురమ్ములగు వచనమ్ముల నిట్లనియె. 50.

గీ. ప్రాణహాననంబు గడుసులభంబు గాని, ప్రాణ మిచ్చుట మనకు సాధ్యంబు కాదు
ప్రాణరక్షణకై పాటుపడనివారు, ప్రాణిపైఁ బ్రేమ లేనివారలును నిలఁ.

గీ. జీవములయాత్ర సంపూర్తి చేయకుండఁ, జంపుచో నెట్టిఁ బాపంబు సంభవించు
జీవహింస యొనర్చెడి చేత సేయు, వారలకుఁ బాపము క్తి చేకూఱ దెపుడు. 52.

సీ. దయఁగోరి వేల్పులఁ దనియించుమనుజాళి, యా దేవతలు జంతువులకు జంతు
వులపైఁ గరుణ మనుజులు పూనకున్న నరులపైఁగరుణ దేవతలకు రాదు
ఇలఁగల జీవరాసులు పరస్పరము సంబంధమ్ము గలయవి పరమునిర్ద
యతఁబూని మీ రిప్పుడాలభించెడిపశు, ప్రాతమ్ము లన్నియుఁ బాలనొసఁగి

గీ. మానవులయంద విశ్వాసమూని యున్న వెవ్వఁ డేనియుప్రతిఁజెందె మృగకోటి
మైనఁ బక్షిశరీరమైనఁ దాల్చి, నవియు ధరియించుచుండు మానవత మరల.

క. మతిహీను లెవ్వరే నీగతి లంచము వెట్టి తుష్టిగావింతురె దే
వతల కయోగ్యుల దుర్వ్యాప్తి పృథులివి సంతోష మిడు నెవీసం జేనిక్, 54

క. తనకావించినకర్మంబున నింతయు నన్యజంతువులపైఁ బడవే
య నశక్య మేరికేఁ దగ్గనె తమకర్మంబుతొరకుడువక యొందుఁ. 55.

గీ. వాఙ్మనఃకాయముల దేహివంతుఁ డెలమిఁ. జెట్టచెడ్డు యొనర్చినఁ జెట్టఫలము
మంచిచెడ్డు యొనర్చిన మంచిఫలముఁ, జెందుఁ గాని తదితరము చెందఁబోడు.

మ. మఱియు న్నెరుపుఁ బేర్మియుం గృపయు సన్మానంబునుం జంతువం
తతిపైఁ జూపక హింస మున్నయిన ధూర్తంత్రంబు లెన్నేనియుఁ
గత కాలంబునఁ జేసికొన్న నవి యత్కృష్టాత్ములం బట్టి యా
యతియందు న్వైతఁ గుద్పు నంచు మతయోగ్యగ్రంథము ల్చెప్పవే. 57.

గీ అనుచు నందఱి డెందంబులందుఁ గరుణ, యమగుణం బుదయింపఁగ నమగుణముగ
విమలబోధ మొనర్ప ఋత్విక్కు లెల్లఁ, దలలు వంచిరి సిగ్గునఁ దపసిఁ జూచి. 58.

వ. రాజును ముకుళితకరకమలుం డగుచు సాష్టాంగనమస్కారంబు గావించిన నతనిదిక్కు మొగంబై యెల్లరకుం దెలియ మరల నిట్లనియె. 59.

సీ. ప్రాణులెల్లను బరస్పరమైత్రి గనవలె, మాంసభక్షణమును మానవలయు
బంగారురంగుమైఁ బరఁగు చక్కనిరాజ, నాలధాన్యము క్రిందఁ రాలినట్టి
తీయనిఫలములుఁ దేటయౌ నీరును, శాకము ల్మొదలగు సకలవస్తు
వులచేత క్షుద్బాధఁ దొలఁగింపఁ జేసి యీ, తనువును గాపాడికొనఁగవలయు
గీ. నీతి నొనర్ప లోకమ్ము బాగుపడును, టంచు బోధించుచున్న సిద్ధార్థు వచన
రసౌఘమున మనసులను తత్త్వ ముదయమందెఁ, దెల్వి యొనువచ్చె నచటి బుధవ్రజాల కెల్ల

వ. ఇట్లు తదుపదేశంబు మనంబుల కెక్కి యాజకులు పశుహింసాకరమ్ము లగు నాయుధమ్ములఁ బాఱవైచియు హోమకుండంబులు చల్లార్చియుఁ దమయంత నరిగిరి. బింబిసారుండును సాంద్రం బగుసంతసంబునం బొదలి జీవహింస చేయఁగూడ దనియు మాంసంబు తినరా దనియు భూతదయ ప్రధాన మనియుఁ దనదేశమందలి సకలజానపదమ్ములఁ జాటించియు శిలాఫలకమ్ముల వ్రాయించియు బలియాగమ్ములు మాన్పింపఁ దగువారి నియోగించెఁ, బదంపడి యెల్లయెడల జీవహింసాప్రచారంబు శశవిషాణప్రాయమై పశుపక్ష్యాదులు నిర్భయముగ మెలఁగఁ దొడఁగె. 61.

ఉ. రాజకులంబునం బొడమి రాజ్య మొనర్చుట మానితత్త్వవి
ద్యాజితమైన చిత్తమున ధర్మగతిం జరియించువానిఁ గా
నా జటిలాగ్రగణ్యు మొగమండలి కాంతి యెలుంగఁజేయ స
త్తేజుఁడు బింబిసారుఁడు నుతించుచు నిట్లనె భక్తిపెంపునన్. 62.

చ. యతివర రాజ్య మెల్లఁ దగినట్టి మహోషమహానుభావపం
క్తి గలమీకు నిచ్చెదనుఁ గా నొకవృత్తియె నాకుఁ బుత్రసం
తతి కలవయ్యెఁ గూడు మొకతం గనియుంటిని దాని నిచ్చి నా
యతులవిభూతి నిత్తు ముదమందుచు రాజగృహంబు నేలుమీ. 63.

వ. అనవుడు బింబిసారుం గాంచి సర్వార్థసిద్ధుం డిట్లనియె. 64

సీ. రాజేంద్ర వినుమేను రాజవంశమునంద, బొడమినవాఁడఁ బ్రఖ్యాతమైన
సౌఖ్యంబు తొల్లి సంసారంబు సేయుచు, ననుభవించినవాఁడ నగుదు నిజము

మునుపు వల్దని త్యజించినసౌఖ్య మిపుడేల, సన్న్యసించితిని విజ్ఞానలబ్ధి
మనమున నెంచి రంభయవచ్చి కామించి,నను నింద్రపదవి వచ్చినను నెల్లఁ
గీ. దనువు గృశియింపఁజేసెడితపములకతనఁ,గాని శాస్త్రములకతనఁగాని యిచటఁ
గలుగుతాపసజనములకతనఁ గాని,జ్ఞాన మబ్బ దటంచు నిశ్చయము [illegible]. 65
వ. కావున గయాప్రాంతదేశంబులం గల చల్లని యడవులకుం బోయి జ్ఞానసంపాదకం బగుయత్నం బొనరింతు నట్టిజ్ఞానంబు నాకు లభించునాఁ డయ్యది నీకుం దెల్పి కృతజ్ఞుండ నగుదు నని మఱియును. 66.
గీ. పాములకు నైన నే భయంపడను బిడుగు, లకును భీతిల్ల దానపావకున కైన
భీతివడఁ గాలి కైనను భీతిఁ జెంద, విషయహతకమ్ములకు బిట్టు వెఱచినట్లు. 67.
క. కామము లనిత్యములు మా, యామయములు వానిఁ గోరి నంతన విద్వ
ద్గ్రామణుల కైన నెక మో, హామయము ఘటిల్లు నంత తానర్థద మై. 68.
శా. ఆశాపాశమువంటి శాత్రవుఁడు లేఁడాసాగరాంతం బిలన్
దాశాసించెడివాని చిత్తమున కైనం దృప్తి గానీదు ల
క్షేశుం గోట్లుగ దంధనం బగుధనం బే కోరఁగాఁ జేయు నా
కాశ్రక్కుల సల్లుఁ దన్మయున కింకం గల్గునే నిర్వృతుల్. 69.
గీ. నేల నాలుగు చెఱఁగులు నేలె దేవ,తావరేణ్యుని యరగద్దె పై వసించె
వలసి కురిపించుకొనెఁ బైఁడివానఁ,దృప్తి, దనరె నేయట్టివాఁడు మాంధాత కైన.
సీ. అమరాధిపతియు దైత్యక్రోధమునఁ దొల్లి, యజ్ఞాతవసతి చేయంగవలసె
మునులచేఁ బల్లకి మోయించిన మదంబు,నన కొండచిలువయ్యె నహుషనృపతి
స్వర్గంబుఁ జేరి లోభమున నిరాబారి, పైఁడిఁగోరి నశించె నే నృపతి
గురుని వేసంబు శుక్రుఁడు దాల్చి మాత్సర్య,మున దేవతల నెల్ల మోసగించె
గీ. గురుని యిల్లాలి తోఁగూడి శుపలయేశుఁ, డపకీర్తి వహించెఁ గామాతిరక్తిఁ
గాన నెంతటివారల కేని విషయ, నిగమనము శక్య మగునయ్య మగధనాథ. 71.
క. ఆకలను లేటికోని తమ, యాఁకలిఁ బోఁగొట్ట[illegible]
మోకపొర ల్గబ్బెడు మును, లేకాముఁ గెల్వఁజాల రేల నరేంద్రా. 72.
వ. మఱియును దుఃఖప్రతీకారనిమిత్తభూతంబులై [illegible] నాఁకలిఁబాపుట కన్నంబులును శీతాతపవారణంబులును గృహంబులును సుఖప్రదేశ

శైత్యవారణంబునకు వస్త్రంబును నిద్రావినోదార్థంబు తల్పంబును మార్గక్లమాప నోదంబునకు యానంబును స్థానపారిశుధ్యంబునకుఁ బీఠంబును శరీరారోగ్యం బునకు స్నానంబును నిర్ణీతంబు లైన వివిసుఖానుభూతికొఱకు నుపయోగించు చుండు కేవలమూఢుండు 73.

గీ. మంచిగంధముకొఱయుగ్రీష్మమునసుఖముఁ, గలుగఁజేసియుదుఃఖంబుఁగలుగఁజేయు శిశిరమునఁగానిజనుఁడెవ్వఁడెంచఁడు, సుఖసుదుఃఖంబుసర్వవస్తువులయందు.

గీ. సుఖము దుఃఖమ్ము నాకేకముఖములగుట, రాజ్యదాస్యంబులును సమభోజ్యములగు ధరణిపతికిని సుఖము నిత్యంబు గాదు, దాసునకు దుఃఖమును శాశ్వతంబు గాదు.

గీ. ఒక్కపుట్టము కట్టుఁ బన్నుండు నొకట, నొక్క యింటన వసియించు నోరమింత మాత్రమే తినుఁ గాని శ్రమంబు యొక్క డీజగం బేలురాజాధిరాజునకును. 76

గీ. అనుభవము స్వల్పమైనను నవనిపతికిఁ, దుష్టి నెచ్చనరాదు సంతుష్టి లేద కనకలోష్టంబులొకరూపు గాఁగఁబుడమి, సర్వసంగంబువదలిసంయములకు.

వ. కావున నన్నుఁ గామపురుషార్థంబునకై పురికొల్పక నాయందుం గలమైత్రికిం దగినఫలంబుగ శివమార్గానుసంధానంబునకై ప్రోత్సాహింపుము. కుటుంబకలహం బునం గాని శాత్రవకృతతిరస్కారంబునం గాని దుర్భరాక్రాంతిచేతం గాని వనప్రవేశంబుఁ జేసినవాఁడఁ గాను. దైవవశంబునంజేసి కనుదప్పి పాతిన క్రూరభుజంగంబు బాపింబడెడు కుబుద్ధిచందంబున నెవ్వఁడు విసర్జించినవిష యంబులం గ్రమ్మఱఁ గైకొనువాఁ డని మఱియు. 78.

క. అంధుఁ డనంధుఁడు నిర్ధను, నిః ధని యున్మత్తచిత్తునింద్యుఁ డమతియుఁ డా పంధింపనిగతి దుర్విష, యాంధులతో మైత్రిఁ జేయుప్రాజ్ఞుఁడు గలఁడే. 79.

క. కావున దుర్విషయములప్రభావము నాతోడ నుడువవలదింక మనో భావములు వృష్టిభూతల, తావలయంబులుగఁ దలఁపదగు నరపాలా. 80.

వ. అని బహుమానపూర్వకంబుగా నమ్మగధనాథుని వీడ్కొని యరాడుం డను నాకమునీంద్రుండు దటకనతిదూరంబున నున్న యాశ్రమమందు నున్నవాఁ డని విని యతనివలన విజ్ఞానంబు వడయ నభిలాషం జనినంత. 81.

ఉ. వచ్చినరాజపుత్రుని గృపాపరిపూర్ణవిలోచనాంచలుఁడై హెచ్చినభక్తితోడ నెదురేగియు నింటికిఁ దెచ్చి యాసనం

నుం గలసి చతుర్వింశతి తత్వంబు లనంబడు దీనిం దెలిసి ప్రకృతికిం బరుండై సాక్షీభూతుం డగుపురుషునిం గనుఁగొన్నవారికి జరామరణరోగ భయంబులు లే విది కపిలమహాముని ప్రోక్తం బగుమార్గం బింక బ్రహ్మమతప్రకారంబు వినిపింతుఁ బుట్టుటయుఁ బెరుఁగుటయు ముదియుటయుఁ గిట్టుటయుం గలశరీరంబు వ్యక్తం బనియునట్టు కాని దవ్యక్తం బనియు ననంబడు. అజ్ఞానంబును నాశయుఁ గర్మంబును సంసారమునకుం గారణంబు లీమూటిం దవిలినవాఁ డెన్నండును దత్వంబుఁ దెలియనేరఁడు విప్రత్యయాహంకారాభిసంప్లవావిశేషాను పాయసంగాభ్యవపాతంబులను నీయెనిమిదియు నజ్ఞానకారణంబు లందుఁ గర్తవ్యమన్యథాచేయుటయు మంతవ్య మన్యథాతలఁచుటయు మొదలగునది విప్రత్యయంబు నేను నాది యనునభిమానమహంకారం బేకపదార్థ మనేకథా తలఁచుట సందేహంబు భేదాభేదశూన్యం బగుజ్ఞానం బభిసంప్లవంబు జ్ఞాన్యజ్ఞానిభేదం బెఱుంగమి యవిశేషంబునమస్కారవషట్కారప్రోక్షణాభ్యుక్షణాదికకర్మతంత్రం బనుపాయంబు మనోవాక్కాయబుద్ధుల దురాలోచనంబు సేయుచు విషయసంగంబు లేనిపగిది నంచరించుట సంగంబు నే నతనివాఁడ నతఁడు నావాఁ డనుకొను టభ్యవపాతంబు. తమోమోహమహామోహతామిస్రద్వయరూపంబున నాయజ్ఞానంబు పంచవిధం బం దలభ్యచింతనంబు తమంబు జననమరణప్రవాహమున నిత్యత్వభ్రాంతి మోహంబు స్త్రీవాంఛ మహామోహంబు క్రోధంబు ప్రథమతామిస్రంబు విషాదంబు ద్వితీయతామిస్రం బిట్టియజ్ఞానంబునకు లోపడక వ్యక్తపదార్థంబు నెఱుంగువాఁ డొకఁడు జరామరణశూన్యం బగు నక్షరపదంబు లభించు నిది బ్రాహ్మమతం బనివక్కాణించు నరాడునకుఁ గుమారుం డి ట్లనియె. 92.

సీ. ఎవ్విధి నెచ్చటఁ నెంతపర్యంతమ్ము, జరపంగవలె బ్రహ్మచర్య మనఘ ధర్మంబునకుఁ బరంస్థాన మెయ్యది యౌతేఁ, గింపవే మదికి లంగింపఁజేసి యనవుడు మాని యిట్లనె మొట్టమొదట గృహంబు వర్జించి సన్న్యాసి యగుచు నింటింటికిని బిచ్చం మెత్తుకొం చొకచోట, నుండక వని నుండెనూరనుండె

గీ. దొరకినది కొంచు దాన సంతోషపడుచుఁ, దనకు వానంబుగా వివిక్తప్రదేశ మొకటి దొరకొని యింద్రియప్రకరమునకుఁ, బట్టువడకుండువాఁడెపో బ్రహ్మచారి

వ. ఇట్టి బ్రహ్మచర్యంబున నంచరించుచు వివేకజన్యం బగునిదిధ్యాసనంబున సులభం బగు పరబ్రహ్మసాక్షాత్కారంబుఁ గాంచుటయ మోక్షం బని కొంద ఱిచ్ఛగింతురు,

అహింసయ ధర్మంబునకుఁ బరస్థానం బిడియవేదోక్తప్రకారం బింతకంటెఁ మను
జుండు గ్రహించుట దుస్తరం బని యుపదేశం బొనరించు నరాడునిపల్కులు
మనంబునం బట్టి. 94.

క. చనిచని యురువేలాకా, ననమున వసియించెఁ గొన్నినాళులు తపప
త్తనమును వదలినది మొదల్పనిసప్పటి కెన్న నాఱుసంవత్సరముల్. 95

గీ. రాజపుత్రకుఁ డయ్యు నరణ్యమందు, నాఱువత్సరములనుండి యనుభవించు
ఘనపరిశ్రమమున ముఖకాంతి తఱిగె, నంగకబలంబు నుడిగె సిద్ధార్థకునకు.

వ. ఇట్లతికృశం బగుదేహంబునఁ బరిభ్రమించుటకుం దగనివాఁడై మెల్లమెల్లఁజను
వాఁడు ముందట. 97.

సీ. పితరులు తరియింపఁ బిండప్రదాన మార్యులపరంపర చేయుచున్నచోటు
నురువలయ మ్మనుసొకకంటకారణ్య, మిసుముకొండలతోడ నెసఁగుచోటు
మిన్నంటుపొడవున మించుమోకలముండ్ల, పొదలు తీవలుఁ బ్రాఁకఁ గదియుచోటుఁ
బూరికొంపలచేతఁ బొలుపారు సేనాని, యనుపే రలరు పల్లె దనరుచోటు

గీ. వెలయు నేయేటియొడ్డునఁ గలయు మోహ, నయునిలాజనియనుగొప్ప యేఱు దులకెంతు
సేనదీవార్ధరంబునఁ దానిఁ గనియె, ఫల్గునీనామకం బగు భవ్యతటిని. 98.

క. కని యాదరపరికంపిత, వనజపరాగములు గలయఁ బర్విన గాడ్పుల్
తనమేనిచెమటఁ దుడువఁగఁ, జనియెను సేనాని యనెడి జనపదమునకున్. 99.

క. చని యాలఁ గాచుకొనున, జ్జనపదచరులైనగోపజనములఁ దగఁగ
న్గొనె వారియమాయికవృత్తి నితాంతము సంతసము మదికి నొసఁగంగన్.

వ. ఇట్లు సంతసించుచు నటఁ గొండొకతడవు నిలిచి తత్ప్రాంతమ్మున నున్న మహా
రణ్యంబునకుం బోయి యచ్చట. 101.

సీ. దైవవశమున నొందవు త్పత్తి గుఱించి, మనుజాలదుఃఖమర్మముల గుఱిచి
యడవిజంతువుల మర్యాదచొప్పునఁ దాను, దెలిసికొందగిన నీతిని గుఱించి
యపరిమితమతసిద్ధాంతమ్ముల గుఱించి, సర్గమరణరహస్యముల గుఱించి
చిత్రచితాప్తిబద్ధ ప్రపంచితశక్రచాపతుల్యంబుగ బ్రదుకు కాలమును గుఱిచి.

గీ. మనము యోజింప ధ్యానసమాధి నూని, యొంటిపాటున నేరికిఁ గంటఁబడక
యుండుశొద్ధోదనికి దాఁటుచుండె మాన్యములకు మానమ్ము లవ్వనభూములందు.

గీ. దైవవశమునఁ దనకుఁ దా నావుసందు
నుగ్గి రాలినఫలముల భుక్తిఁ గొనుచు
నరుణు నుదయాస్తమయముల నైన నెఱుఁగ
కష్టి ధ్యానించు నిస్తంద్రుఁ డగుచు నొకట. 103.

వ. నిరంతర జ్ఞానాసక్తుం డగుచిత్తంబున నాహారంబు మఱచి యున్న సిద్ధార్థుని శరీరంబు మిగులఁ గృశించె మోమునఁ గాంతియుఁ గనుమాసెఁ బదంపడి యొకనాఁడతఁ డాయాసంబున స్మృతిఁ దప్పి పడి నిర్జీవంబోలి మూర్ఛనొందిన నొకగోపబాలకుఁడు తత్ప్రదేశంబునకుం బోవుచు నతనిం గనుంగొని వడఁదాఁకెనని యెంచెను.

క. కాలం బొగులుచు జంబూశాఖలు నఱికి పాఁతి నాలుగుదెసలన్
మేలుగఁబయి నీడరా నొక్కగృహం బాకులను జేచి కల్పించె వెసన్. 104

వ. ఇట్లు సహజభూతదయాపారీణుం డగు నా చిఱుతగొల్లం డొకపర్ణకుటీరంబుఁ గల్పించి తాను దాఁకినఁబాతకం బగునని యెంచి మేఁకల నతనిపాలికిం దోలికొని పోయి దుగ్ధంబు లమ్మహానుభావుని నోటను పిదుకుచుండె నిట్లు కొండొకకాలంబు చనుడు జంబూనగశాఖలన్నియు నిగిరించి పాదచాయ్వున నల్లిబిల్లిగ నల్లుకొనియె నతండును దైవంబుగ నతనిం బూజించుచు నుండ నొక్కనాఁడు తెలివొంది తననికటమ్మున నున్నగోపబాలునిం జూచి తత్కరస్థితిఘటితంబు లగుదుగ్ధంబు లిమ్మనఁడు నతఁ డిట్లనియె.

క. ఈపాలు నేను దాఁకితి, గోపాలుఁడఁ గాన నీవు గొనఁగాఁ దగ దో
శాపాయుధవర యనున, ప్పావని గని నగుచు భూమిపతి సుతుఁ డనియెన్.

సీ. నీశరీరమునందు నెత్తురు నాశరీరమునందు మంచిదుగ్ధములు కలవె
నాతల్లిదండ్రులు నన్నుఁ గాంచినరీతి, నీ తల్లిదండ్రులు నిన్నుఁ గనరె
నాకున్నరీతిని గాక నీకక్షిలావ, యవముల లోపమెందైనఁ గలదె
నీకంటె మున్న నీ వుండి నాకంటఁ, జప్పని రుచిగల జలము గలదె

గీ. వేఱుమఱయి బొట్టుజందెంబు బుజమునందు, వ్రత్తిలెనె జన్మమందరో వ్వరికిఁ గాని
యీవు దాఁకినమాత్రన యేల పాలు, నేఁ గొనం దగ దంటివి నిజము చెపుమ. 108

చ. అన విని గోపబాలుఁ డవి యన్నియు నిక్కము కాని నన్నుఁ జే
ర్చిన నివాసస్థలంబునకు మేఁకలఁ గావఁగ నంపు నాఁడు మ

వ. అని తలపోయుచుఁ దదరణ్యస్థం బగు నొకవనదేవతాలయంబునకుం బోయి యట
నిస్తంద్రుఁడై యున్నంత. 118.

సీ. తనపేరఁ బల్లెని తటమునఁ గట్టించు, కొనినసేనానియన్ జనపదమునఁ
గాఁపురంబుండు నొక్కఁడు ధనవంతుండుఁ, బశుపతిధర్మతత్పరుఁడు బుద్ధి
మంతుండు విబుధసమ్మతుఁడు వానికి రూప, వతియు సాధ్వియు దయావతియు సత్య
సంధురాలును మృదుసంభాషిణియు సుజా, తయు నగు నొక కళత్రంబు గలదు

గీ. సకలజనములు దానిసుజాతయండ్రు, మాయయను మాటయెఱుఁగ దమ్మగువ తమకుఁ
గాన్పు లేదను వంతయొక్కటియుఁ దక్క, నన్యదుఃఖంబెఱుంగ రయ్యాలుమగలు,

వ. ఇట్లు కొడుకులు లేమిం గడుకొను దురంతచింతాభరంబునఁ గరమ్ము లందురు
నాసుజాతయు. 120.

క. రాకారాత్రులయందు ను, త్రైకోదయవాంఛఁ జేసి యేకాశీతి
ప్రాకారప్రదక్షిణములు, తేకువఁ గావించు విపినదేవతగుడికిన్. 121.

సీ. ధ్యానంబుఁ గావించి యావాహన మొనర్చి, సింహాసనం బధిష్ఠింపఁ జేసి
యర్ఘ్యం బొసంగి పాద్య మిచ్చి స్నానంబుఁ, జేయించి నెమ్మేను చేలఁ దుడిచి
యజ్ఞోపవీతవస్త్రాదులను నొసంగి, కస్తూరియును మంచిగంధ మలఁది
ధూప మాఘ్రాపించి దీపంబుఁ జూపించి, పదపడి మదిభక్తిఁ బాదుకొలిపి

గీ. వన్యఫలములు వడపప్పు వన్యమాక్షి, కంబు శాల్యోదనంబు శాకములుఁ దెచ్చి
వేడుక నివేదన మొనర్చి పాడి యిట్టు, లనుదినము సేవకావించు నాసుజాత.

క. కొడుకొక్కఁడేని నాకుం, బొడమిన రుచిగల్గు తగినభోజ్యమ్ములు నేఁ
గుడువం బెట్టెద నీకుం, బడిబడి మాయమ్మ పైఁడిపళ్లెరమందున్. 123.

వ. అని మ్రొక్కికొని తదేకతాత్పర్యమునం బూజించు నాసుజాతను. 124.

క. నెలతప్పి క్రమంబుగ వేవిళు లాదవెన్ నడుము ప్రబలె వెలవెలమనెఁ గ
న్నులు మొగమును జన్మొనలన్, నలుపాదవెన్ నీరుమోయ నానాఁటి కొగిన్.

వ. ఇట్లు చూలాలెంతరాలు పదినెలలు నిండి యొక్కశుభముహూర్తంబునఁ గుమారుం
గని నంత సేనానినివాసు లందఱును సంతోషసాగరంబునఁ దోప్పదోఁగిరి. 126.

క. సేనానియు డెందమున న్నమానానందంబుఁ జెంది నూటులకొలఁదిన్
దానంబుఁ జేసె గోవుల, మానితమర్యాదులైన మహిదేవులకున్. 127.

వ. సుజాతయు నన్నిసువునకు మూఁడవమాసంబు చనుదెంచుటయుఁ దన మ్రొక్కి
కొనిన మ్రొక్కుఁ జెల్లింపఁ దలంచి తత్తత్పదార్థంబులు శిరంబుమీఁద నిడుకొని
యొకకేలం గుమారు నెత్తికొని విపినదేవతాలయంబునకుం బోవుచుండ నదాల
యాలంకారార్థంబుగ మున్ననుపంబడిన రాధయను దాసి వచ్చి యచ్చెరువుగ
ని ట్లనియె. 128.

క. వనదేవత మనపుణ్యమ్మున నట సాక్షాత్కరించె ముఖసౌష్ఠవ మే
మనవచ్చు సుజనభావం, బెనయించు విలోచనంబు లింతలు తల్లీ. 129.

క. అనుచుం దత్తరమునఁ గడు, వినతశరీర యగుదాసి వితమంతయు నె
మ్మనము వికసింపఁజేయఁగఁ, జనియెం గుడిచెంత కాసుజాతయుఁ జేర్మిన్.

వ. చని యటమున్న దేవళం బధిష్ఠించి యున్నసిద్ధార్థుం గాంచి దేవతాభ్రాంతిం
జేసి తత్తత్పదార్థంబు లతనిచెంత డించి నిసువుం బానిసచేతి కందిచ్చి సాష్టాంగ
ప్రణిపాతం బొనర్చి యి ట్లనియె. 131.

ఉ. శ్రీకల గేస్తునింటికిఁ బ్రసిద్ధివహింపఁగ వచ్చి వంధ్యనై
వేఁకటి రాక దానఁ బలవించుచు నీకయి మ్రొక్కుకొన్న యీ
నాకు మహోపకారము నొనర్చితి వీవు దయోదయమ్మునన్
గైకొనుమమ్మ నాయిడిన గవ్యఘృతంబును బాయసంబునున్. 132.

వ. అని వేఁడికొనిన నశనాయావివశుం డగుసిద్ధార్థుండు మాటాడక యవియన్నియు
భుజించి తద్దత్తమ్ము లగుపరిమళద్రవ్యంబు లాఘ్రాణించి తత్త్వవిచారార్థం బింత
కమున్ను గడపిన దివారాత్రంబు లన్నియు స్వప్నానుభూతంబులపగిదిఁ గన్పట్టు
చునిరంతరోత్సాహబలసంపన్నుఁ డగుచు నాసమర్పించిన మ్రొక్కు యథోక్త
ముగఁ జెల్లెఁగదా యనునాసుజాత కి ట్లనియె. 133.

క. ఈ విపుడు నాకొసంగిన, యీవస్తువు పేర దేమి యొకటి గింపుము నీ
కావించిన విధమే యది, నావుడు ని ట్లనియె నతివినయమున సతియున్. 134.

సీ. మామందఁ గలవందమంచి గోవులనుదు, గ్ధము లేఁబదింటికిఁ ద్రావఁబోసి
వానిక్షీరమ్ములు పంచవింశతిగోవు, లకుఁ బోసి వానిపాల్పదియు రెండు
ధేనువులకుఁ బోసి వానిపా ల్గోవత్స, వమునకుఁబోసి యవ్వానిపాలు
పరిమళద్రవ్యసంభారమ్ముతోడఁ గ్రాచి వైఁడిగిన్నెఁ బోసి పదవడి

గీ. సరసచందనపటపికాస్థగులమంటఁ గాఁ గాఁజేసి యందముసుక్తాఫలములు
వోని తెల్లనిబియ్యమ్ముఁబోసి పంచ, దారతో నండిపట్టి పొంగదనము తల్లి! 135.

వ. ఇట్టిజియ మున్ను నా ప్రొక్కికొనినయది నిక్కంబుగ వనదేవత వైనవేని దాసు
రాల నగునా ప్రొక్కు లంకొని నన్నుం గృతార్థత్వమొందింపు మని కలతెఱం
గెఱుంగక భక్తిపరవశయై ప్రార్థించు నాసుజాతం గాంచి యతండు, 136

క. మునిముసినగ వోలయఁగ న, న్ని సువ్ర శరీరంబుఁ గేలనిమురుచుఁ దలపై
మునుఁగుం దీసి చిరంజీ. వ సుఖీభవ యంచుఁ బ్రియముఁబడి దీవించెన్. 137.

వ. ఇట్లు దీవించి తల్లీ నేను వనదేవతను గాను శుద్ధోదనుం డను నొకరాజుకుమారుం
డ ననుచుఁ దనవృత్తాంతం బెల్లఁ దెలిపి వెండియు. 138.

గీ. క్రమముగా నైకజంతుసంతానంబులు గతన, నీపదార్థంబు పుచ్చ నైయొనఁగినట్లు
నైకజన్మంబు లెత్తి యనంతరంబ, జీవుఁడును ముక్తియను ఘనస్థితికి వచ్చు.

వ. అనుచు నీవలనం దెలియవయ్యె ని ట్లనేకయ జన్మంబు లెత్తుచున్నంతన జన్మసా
ఫల్యంబు నందుసనో లేక జీవించియుండియు భూతదయ నున్నగు ధర్మంబులు
కలిగియున్నం జాలునో యనియు నీవలనం దేటపడవలసిన యంశంబు లియ్యవి
సావధానంబుగా నావతీవలయు ననుడు సుజాత యతని కిట్లనియె. 140.

గీ. నేను మూర్ఖురాల నీయడిగిన యర్థ, ములకు నుత్తరంబు నొసఁగ లెఱుంగ
నాయెఱింగినంత నాచేసినంతయుఁ, దెలియఁజేసెదఁ దేటతెల్లముగను. 141.

గీ. అనుదినము వేగ లేచి సత్యస్వరూపు, దేవు నెదలోనఁ బాటించి ధవిరి పతికి
వలయు శుశ్రూష సల్పుచు వస్త్యవిధుల, నిరత మొనరింపఁజేయు బానిసలచేత.

వ. వాపీకూపతటాకమ్ములు త్రవ్వించుటయు శివాలయంబు గట్టించుటయు నగ్రహారం
బొసంగుటయు ధననిక్షేపంబును వసప్రతిష్ఠయుఁ స్మృతిప్రమాణంబును బుత్రప్రాప్తి
యు ననునవి స్వర్గప్రాప్తిసాధనంబు లని యాగమంబుల నుడువంబడు నట్లగుట
మత్పతికి స్వర్గప్రాప్తిసాధనీభూతుం డగునిక్కుమారునిం గాంచుటకు ననేక దేవ
తారాధనంబులు గావించితి. పరలోక సౌఖ్యంబులకెల్ల కుమారుండు మూలం బని
యాగమశాస్త్రాంతంబు దేవతలతోడ సంభాషణాదులు గలిగి మంత్రములు నేర్చిన
మహానుభావులకన్న నెక్కుడుగఁ దెలియఁదానఁ గానికతమ్మున నాకుఁ దత్ప్ర
తంబు లగుగ్రంథమ్ములయందు విశ్వాస మధికంబు మంచిచెట్లు లొనరించిన వారికి
మంచిచెట్టులు గలుగు నని నాయెఱింగినతెఱంగు. 143.

క. యాదృశబీజము నాటినఁ, దాదృశవృక్షంబు నొదవు◆ తప్పక యటు లా
యాదయలవలన నయసూ, యాదయ లుదయించు నేరి◆కైనం జగతిన్. 144.

క. దైవము వ్రాసినపగిదిం, గావున్న దెవ్వే సమస్త◆జంతువులకుఁ దాఁ
గావించు పుణ్యపాపము, లేవానికి నేని నూరి◆కేపో వెపుడున్. 145.

వ. ఒక్కయవబీజంబు భూమిపై నాటిన యయ్యది నశించియు ననేకయవబీజమ్ముల నుదయింపంజేసిన పగిది నీ జన్మంబు నశించియు ననేకజన్మంబులకుం గారణంబు గాఁగల దదియుం గాక జీవించియున్న కాలంబె దుస్తరంబు లగు కష్టపరంపరలు తండోపతండంబులుగా వచ్చుచుండెడి నని మఱియును. 146.

క. పతిమున్న పొందె విడచినఁ, జితిలోఁ బడి యేను మేను◆ దహించి యతనికిన్
గతిఁ గావించెద నుత్తమ, గతికిం జనులకును సతులె◆ గతులు దలంపన్. 147.

క. మాకన్న మున్న బిడ్డఁడు, చాకుండఁగ వలయుఁ గాని◆ చచ్చిన యెడలన్
మాకొదవు దుఃఖవారిధి, కేకరణిం దరపఁ గల్గు◆ నిద్ధచరిత్రా. 148.

క. కావున నామన మెన్నఁడుఁ, గావునకై వెఱవ దనఘ◆ సరిగా జన్మం
బీవరుస దుఃఖ మేది సు, ఖావిర్భావమున జరగ◆ నయ్యెడు నాకున్. 149.

క. రిత్తులపై దుర్విషయా, సక్తులపైఁ గష్టపడెడు◆ సంసారులపై
నక్తందివంబుఁ గరుణా, సిక్తత జాలివడు నాదు◆ చిత్తం బనఘా. 150.

క. అపకృతి యొనరింపమియును, నుపకృతి యొనరించుచుంట◆యును సత్కృతులం
దపియించుట లోనగుపు, ణ్యపరంపర నాయొనర్చు◆ నట్టిది తలఁపన్. 151

వ. కావున నాకు వచ్చెడిదంతయు ననుకూలంబుగ నె పరిణమించుచున్నదని నెడువు
సంజాతం గాంచి సిద్ధార్థుం డిట్లను. 152.

క. నీయుపదేశము గడుభద్రాయితమై మదికి నచ్చెఁ◆ దల్లీ పెరవ
నీయంతవాని నన్నుం, జేయుము దీవించి వృద్ధిఁ◆ జెందెద నీవున్. 153.

వ. నావుడు నట్ల దీవించినంత నమ్మాయాదేవీనందనుండును నాయమ్మను వీడ్కొల్పి యచ్చోటు కదలి శతవిటపసమాకులమ్మును నిరంతరచ్ఛాయావలితంబు నగువాక వటవిటపి చెంతకుం బోయి తచ్ఛీతలచ్ఛాయ నధిష్ఠించి యున్నంత. 154.

లతలెల్లన్ వెడచల్లె నొప్పుగతిఁ బ్లూ◆లన్ వన్యసత్వంబు లా
ధృతినన్యోన్యవిరోధముల్ విడచి మై◆త్రింబూని సిద్ధార్థు స

స్మృతికిన్ హెచ్చి మహానుభావుఁ డితఁడే•మాన్యుం డటంచుం గడుం
గుతుకంబొప్పఁగ సేవఁజేయఁ దొడఁగెన్•క్రూరత్వమున్ మానుచున్. 155.

వ. ఇక్కడఁ జని సిద్ధార్థుం డుండు నెడ. 156.

క. ఆకాశ మెఱ్ఱవడియె ది, వాకరుఁ డస్తంగతించె•బక్షులు వృక్షా
నీకములఁ జేరెఁ గ్రమముగఁ, జీఁకటియు న్నేలనాల్గు•చెఱఁగుల మూసెన్.

క. తనకున్ లోఁగక భూవర, తనయుఁడు నిర్వాణకాంక్షఁ•దపియించుచు నుం
డినఁ గన నైఁపని వెడవి, ల్తునకుం గడుకొనియె బిట్టు•దుఃఖం బంతన్. 157.

వ. ఇట్లు చింతించుచున్న మదనునికడకు విభ్రమదర్పహర్షాభిధాను లగునతనికొడుకు
లును ప్రీతితృష్ణారతు లను కూఁతులును వచ్చి నీవికారంబునకుఁ గతంబే మని
యడుగ నాతం డి ట్లనియె. 169.

మ. అకటా యీముని ధైర్యమూని మనభృ•త్యవ్రాతముం గెల్చి మా
మకకీర్తిం దఱిగింపఁబూనె నితఁ డి•మ్మాడ్కిం గురుజ్ఞానవ
ర్తకుఁడై లోకముహారి ముక్తితరుణీ•రాజ్యంబు నేలించినన్
వికలంబై మనవంశమే యడఁగు దా•నిం గూర్చి చింతించెదన్. 160

క. ఈతండు జ్ఞానియయి లో, కాతీతుఁడు కాకమున్న•యడఁచ న్వలయున్
శాతాస్మదీయ బాణా, పాతంబున నేతదీయ•పటుధైర్యంబున్. 161.

వ. అని సాహసిక్యంబుఁ దెచ్చుకొని. 162.

మ.* రతిపార్శ్వంబునఁ గేల నిక్షుధనువున్•రాజీవముఖ్యాశుగ
వ్రతతుల్ కక్షమునం జెలంగఁ దరుణీ•వారంబు కీరంబులున్
శతసంఖ్యంబుగ వెంటరా సొబగుటం•చల్ శెమ్ములున్ నాట్యనం
గతులం జూపఁగ నేగుదెంచె నటక•ర్కాముండు రామాకృతిన్. 163

క. చనుదెంచి ధనువు సజ్యం, బొనరించి కరంబునం దొ•క్కుగ్రాశుగముం
గొని మునినిం గని యి ట్లని, యెను నేత్రము లెఱ్ఱఁబాఱ•యింతింతలుగన్. 164.

శా. ఓరీ క్షత్రియపోత ముక్తిఁ గనఁబో•నుద్యోగమున్ మాని యిం
పారం గోరు మభీష్ట మిచ్చెదను ధ•ర్మాసక్తి వర్జింపుమా
నారాచం బిది మేనిమీఁదఁబడె నే•నాశంబుఁ గావించు నీ
ధీరత్వంబును నైష్ఠికత్వమును ఖ్యా•తిస్థితియున్ జాతియున్. 165.

ఉ. పుట్టితి వార్యపూజ్య మగు•భూవరవంశమునందు ముష్టిఁజే
పట్టుట ఖ్యాతియా ప్రజల•పాలనఁజేయుట ఖ్యాతిగాని యి
ప్పట్టున నైన నాపలుకు•పల్కులు సుంత త్రొక్కియో యుగంబునఁ
బెట్టుము పెట్టవేని మది•బీరము ధైర్యముఁ గాచుకొ మ్మికన్. 166.

క. అనుచుం బాణముఁ జాపం,బునఁ దొడి కన్యలును సుతులు•ముం బడఁ జెల్లా
డ నిభృతలక్ష్యం బై పద,లెను బ్రత్యాలీఢపాద•లీనుం డగుచున్. 167.

క. వదలినశరమునకుం ధృతిఁ, జెదరక కీడ్పడక వికృతిఁ•జెందక లోనం
బదరని శాక్యకుమారుని, మదిఁ గచ్చెరువంది కుంది•మదనుం డంతన్. 168.

చం. వలిమలరాచబిడ్డ యగు•పార్వతికై మును శూలిచిత్తముం
గలఁచిన బాణమున్ సరకు•గైకొనఁ డక్కట నేను శంకరుం
గెలిచినవాఁడఁ గానొయిది•కీడ్పడఁజేసినయమ్మ గాదొ నా
బలము క్రమంబుగాఁ దఱిఁగి•పాడ్వడెనో యని లోఁ దలంకుచున్. 169.

గీ. కుసుమశరములు సరకుగాఁ గొనఁ•డితండు, రతియుఁ జాలదు వీనిసం•రంభమునకు
గాన భూతగణమునకు•లోను జేయ, గెలుచునని యెంచుఁ దదభూత•ములను బిలిచె

సీ. తలఁచినయంత ని•ద్రాప్రాసనాశర, ప్రముఖనైకాయుధ•పాణు లగుచు
నైకంబు లైనయా•ననములు నైకంబు,లైన నేత్రములును•నైకములగు
రూపులు గల్గువా•రును నగుభూతభృ,త్యులు వేనవే ల్వచ్చి•యుత్సుకులయి
క్రూరమృగంబు లై•కొందఱు వడగండ్ల, కొండలు గురిపించి•కొంతమంది

గీ. కొండచిలువలుగా వచ్చి•కొంతమంది, కుంభవృష్టులు గురిపించి•కొంతమంది
కుజములఁ బెఱికి వైచుచుఁ•గొంతమంది, యేఁచిబాధించిరా శాక్య•నృపతనూజు

గీ. ఇట్లు భూతగణంబు ల•నేకగతుల, బాధ సేయఁగ శాక్యనృ•పాలసుతుఁడు,
భయముఁ గాంచక ధైర్యంబు•పాటుచెడక, నంచలింపక యుండెఁ గా•ష్ఠంబు పగిది

క. తనచేయు కితవమార్గం,బునఁ బడనిమునీంద్రు ధైర్య•మున కటు భంగం,
బని యెంచు మన్మథునకున్, వినఁబడె నాకస్మికముగ•వింటం బలుకుల్. 173

శా. ఓరీ మార యిఁకేల మానుమురనీ•యుద్యోగ మీవాని యా
చారంబుం బొగడీయ సీతలమె వి•జ్ఞానంబు నానాభవో

దారం బై ఘటియించె నీతనికి నూర్యాచంద్రమోపహన్నులుం
బౌరాహారము లాటుగాని చలియింపం డీతఁ డెం తేటికిన్. 174.

సీ. అజ్ఞాన మనునంధకారంబు మాయించు, రత్నప్రదీప మార్పం దలంచె
దుర్ఘోధ మనురవిద్యోతంబుఁ బొలఁగించు, పారిజాతంబుఁగూల్పం దరంచె
కుమతంబు లనుధరాజములను జెకలించు, భద్రనాగంబుఁ జంపం దలంచె
జీవహింసాదావపావకంబు హరించు, పటుమేఘదంబు రేపం దరంచె

గీ. నీతలకు మించి పోయినరీతిఁ జేయఁ, బూనుకొంటివి నీబుద్ధి బూడిదగాను
బ్రాగ్గతం బగుకీర్తియు భంగపఱుపఁ, దగునె చాలింపు మీపాడు తెగువ మార.

శా. అంత న్మారుఁడు బుద్ధుఁ డీజగమునం దజ్ఞానముల్ మాపి తా
నెంతేజ్ఞానలతల్ నిగుడ్చు నిఁక నే నేరీతి నిం దెందు వ
ర్తింతున్ జ్ఞానుల క్రీపచారములు వింతే దీనికే న్మాఱు గా
వింతుం గాక యటంచు శస్త్రగణముం బ్రేరేఁ పెఁ బ్రేరేపినన్. 176.

క. చెలరేఁగెడి యార్వుల న్మిమ్ములఁ గామక్రోధలోభమోహాదులు ధీ
లలితుఁ డగు బుద్ధునకు నాసలుగొల్పి కలంపఁజొచ్చె నప్పాచితిగన్. 178.

ఉ. కోరికపుట్టుఁ గ్రోధ మొనఁ గూడు దురాశ జనించు లోనె నే
పారు మదంబు కైపొదవు నంతన పంతము హెచ్చు దుస్థితిం
జేరఁగ నీని యమ్మహితు చిత్తమునం దిటు పైన నవ్వ లె
వ్వారు జయింప నేర్తు రరివర్గ మెదిర్చి కలంపఁ జొచ్చినన్. 178.

క. పదపడి యాతం డిది నెమ్మది నెఱిఁగినవాఁడు గాన మఱపుఁ గనక దు
ర్మద మగునరివర్గంబుం, బెదరించి కలంపనదియు భీతిలి యేగెన్. 179

వ. పిదప నహంకారమ్మును మాయయు సాహసికత్వంబును జిగీషయు గర్వంబును
నవిద్యయు లోనుగాఁ గలదుర్గుణమ్ములు న్వస్వరూపంబుతో నెదుటం బొడకట్టి
బుద్ధిం గాసి పెట్టినను నతండు నిర్వికారుండై యుండె. 180.

సీ. అంధకారముభంగి నావరించెడి మాయ, కిసుమంతయైన జోటిక కలఁచి
పృథ్వీధరముభంగి పెచ్చు పెరుఁగు నహం, కారంబునకు లోను గాక మిగిలి
కారుబెబ్బులిరీతిఁ గదియుగర్వమున కావంత యేనియు లోఁగక ట్టె తఱిమి
కడలి పోలికఁ బొంగు గను జిగీషాపిశాచముకంటఁబడక వంచన ఘటించి

గీ. యధికవిజ్ఞప్తి నెసఁగు సిద్ధార్థు నెదుట, సంగనలంగులను నయ్యనంగదేవు
సంగతులుఁ గోకిలాలాపభంగులును బ్రసంగుఁ గనలేక యూరకుండఁగవడియె.

వ. అంత మదనుండును. 182.

చ. సుచిరకృశాంగి యతానలయశోధరపుత్రునిఁ గ్రమంబుఁ దా
లిచి నను వీడు టొప్పగునె లేమ ననాథ ననాదరించు నె
విచికెలగంగు లీవిరహవేదనకుం దగుబాలె యంచు నే
డ్చుచుఁ దను నెంచుభంగి స్వపనూనునికట్టెదుటం గనంబడెన్. 183.

క. కనుపట్టిన నివియెల్ల మృరునిచెయ్యిలె యంచు లోసరోయము బుద్ధుం,
డనుమాన మొకించుకయును, గనకుండె వికారమెల్లమనులకు నౌదవున్. 184.

వ ఇట్లు మదనోద్యోగంబు విఫలం బగుటయు.

ఉ. మాయ య దెంతకేని నవమానముగాఁ దన కెంచి మీఁద న
త్యాయత మైనవృష్టి భయదమ్ములు గర్జితముల్ చెలంగఁగా
వాయు వమేయ మై విసరఁబాదపముల్ ధరఁగూలఁ గల్పనం
జేయుఁడు నాతఁ డెయ్యెడవసించునొ యయ్యెడ కెక్క దద్దియున్. 186.

క. పదపడి దిక్కులు తెల్వింబొదలెం ధర నిర్మలత్వముం గనెఁ గడు మే
లొదవెన్ సత్వములకు దె, వ్యదృష్టి యుదయించె నంతనయ్యనఘునకున్. 187.

వ. ఆదివ్యదృష్టికతన నతని కైదువందలయేఁబది జన్మములందలి తనవృత్తాంతం బెల్లఁ గన్నులకుం గన్పట్టుటయే కాక పూర్వపూర్వకృతసుకృతదుష్కృతంబు లుత్తరోత్తరసుఖదుఃఖ కారణంబు లని తెలియంబడియె నంతఁ బ్రతిమనుజానకు యోగాయోగంబులకుఁ బురాకృతంబ కారణం బని యెఱింగి సంసారంబు కదళీగర్భనిస్సారం బని తలపోయుచు ననంతమ్ము లగు లోకంబులును సూర్యాదిగ్రహమండలవిశేషంబులును వానిగతులును వీచీతరంగన్యాయంబునం బొదలు ననియు వీనికన్నిటికి నొకమహాశక్తి పట్టుఁగొమ్మ యై యలరు ననియు నయ్యది యిచ్ఛామాత్రంబునఁ జీఁకటినుండి వెలుతురును మృతినుండి ప్రాణమ్మును శూన్యతనుండి పూర్ణత్వంబును నరూపంబునుండి రూపంబును గల్పింపఁ జాలు ననియును నీయర్థంబున కౌ ననువారలును గా దనువారలును లే రనియు నిదియే పరోక్షత్కృష్టం బనియు వికారశూన్యం బనియు సృష్టిస్థితిలయంబులకుం గారణభూతం బనియుం

దాళ్ళద్రుమపత్రముల్•తళతళ మీఱు బం,గారుచామరములఁ•గౌరుఁదాల్చె
హరిణంబులాదియౌ•నతిసాధుజంతువుల్, క్రమముగా మేల్కాంచఁ•గాఁదొడంగె
గీ. శుకపికాదికసర్వప•క్షులును నిదుర,లేచి సూర్యునివినుతి స•ల్పెడువిధమునఁ
గూయ మొదలిడె నంతన•ర్కుండుపొడిచె,దిక్కులం దంతకంతకుఁ•దెల్వొ హెచ్చె.
క. ఆనాఁటిసుకృత మేమనఁ,గానగుమఁడి నెల్లరకు వి•కాసము ప్రబలెన్
శ్రీనెగడి రెల్లవారును, జ్ఞానోదయ మతనిమదికిఁ•గలిగినకతనన్. 194.
సీ. వర్తకు ల్మోసంబు•వర్జించి తూఁచిరి, దస్యులెల్లరుఁ దొంగ•తనము మాని
కని సేయుచారు తా•మంతతో విరమించి, శాధివంతులబాధ•లడఁగఁదొడఁగె
గటికవాండ్రును గత్తిఁ•గడకొత్తి రజ్ఞాను, లకునెల్ల జ్ఞానవి•లసన మొదవె
రోగులెల్లరును నీ•రోగులై చెన్నారి,రెల్లజంతువులకు•నెలమి వొడమె
గీ. చచ్చిపోయెడి వారలు•సయిత మతని, జ్ఞానలవ మింత సోఁకిన•కతన నొయ
నంగ విస్మితవదనులై•యలరి రది యి,డి యనవేటికి సర్వంబుఁ•దేటపడియె. 195.
క. ఆకాశమునం దమరులు, మాకార్యము ముగిసె ననుచు•మాటికి పంతో
షైకస్థితి వచియించుచుఁ, బ్రాకటముగఁ బూలసోన•వర్షించి రొగిన్. 196.
క. చిరవిరహావేదనాభర,పరవశ లైయి పగలఁ బోగులు•పావనికె యశో,
ధరకానాఁడు హృదబ్జాం,తరమున నామోదరసము•తానై పొడమెన్. 197.
మ. పులులున్ లేళ్లును నెక్కుచోమసలెఁ బా•ముల్ క్రౌర్యముల్ మాని యూ
దలలన్ వంచి చరించెఁ గొంగలకు మ•త్స్యంబుల్ భయంబొంద కెం,
దు లలత్తుంగతరంగరింగణములం•దుం గంతులన్ వైచె నె
క్కుగతిం దోఁచెఁ బ్రపంచ మెల్లరకు వ•క్రప్రక్రియాశూన్యమై. 298
వ. అట్టియెడ సిద్ధార్థుండు బుద్ధుండై. 299.
శా. ఎన్నేజన్మము లెత్తి యెత్తినను నే•నెంతేని నీరీతిఁ గా
నన్నేర న్నిను నేఁటికిం దలిసి కొ•న్నాఁడన్ భవద్వృత్తి నో
యన్నా మామకజన్మకారణ మమా•యాచాకచక్యక్రియా
సన్నం బైన శరీరలబ్ధి కిఁక నే•సంధింతు నంతస్థితిన్. 200.
వ. అని యనుకొనుచు నిర్వాణపదారూఢుండై యావటవృక్షంబు క్రిందన ధర్మాసనంబున నాలుగుసప్తాహంబులు గడపి నానాదిగంతసమాగతులగు నంతేవాసిజనంబు

లను నిర్వాణసాక్షాత్కారంబు నుడువుచు నాప్రదేశంబు కదలి సతతసంసేవ్యమానపరస్పరసజనసమాకులుండై యెడనెడ నగరపల్లీవనపర్వతప్రదేశంబులందు బోధిసత్వం బుపదేశించుచు విజ్ఞాత లగునంతేవాసిగణంబుల నుపదేశకులఁగా నాయాదేశంబుల కంపుచుం జనిచని. 201.

క. మననగరంబున కెన్నఁడు, చనుదెంచునొ తమము నెపుడు సమయించునొకో
యని తలఁచు బింబిసారా,వనిపతిపురి బుద్ధగగనపతి యుదయించెన్. 202.

## ఆశ్వాసాంత పద్యములు.

క. ప్రకృతపురాతనకవిరా,జకృతాంధ్రకృతిప్రపంచసారస్వమిళ
త్ప్రకృతీ సుకృతీ మదినా, సుకృతీ కృతిమాధురీవినోదితసుకృతీ.

మ. కవిరాజానుమతప్రచార లలితాకారా గుణాపార వం
దివరాభిష్టుతనైజసార స్వకథానీతామృతాస్వాదిమా
నవరాణ్మౌళిసుతానతార్తిజన ధన్యప్రాభవా రెడ్డిపో
లవరాధీశ్వర కృష్ణరాయనరపాలా సత్యశీలాగ్రణీ. 204.

## సుగంధి.

ధీరధీర గర్వదూర ధీవిశాల శాంతిశూ
రారమాకుమారతుల్య రాజసూయమానవి
ద్యారసప్రసన్నతాంధ్ర తత్త్వవిత్వకర్తృవా
రా రసాబుధేంద్రకృష్ణరాయభూమిపాలకా. 205.

ఇది... శ్రీతిరుపతివేంకటేశ్వర ప్రణీతంబైన బుద్ధచరిత్రంబను
మహాప్రబంధమ్మునందుఁ జతుర్థాశ్వాసము

శ్రీరస్తు.

తిరుపతి వేంకటీయము.

# బుద్ధచరిత్రము.

## పంచమాశ్వాసము.

క. శాంతరసాపూరితహృద, యాంతర కాంతస్వరూప యశశ్శీతా
శాంతకృతాకించనతా, కృంతన కవిరాజగేయ కృష్ణారాయా. 1.

వ. అవధరింపు మనంతరం బట్లు బుద్ధుండు రాజగృహపురంబుం జేరి యుండె, నిచ్చ
టఁ గపిలవస్తుపురంబునఁ దండ్రి శుద్ధోదనుండు. 2.

మ. ప్రతిదేశమ్మును జారులం బనిచియుం బైరాగులం గాంచిన
ష్టు తనూజాతుఁడు వారిలోఁ గలసినాఁడో యంచు వీక్షించియుం
బ్రతివారమ్మును యత్న మెంత యయినం బాటించిపాటించి త
త్ప్రతి యొక్కింతయుఁ గానరామి మదిఁ జింతించుం దివారాత్రముల్. 3.

వ. వెండియు సిద్ధార్థభార్యయును బరమపతివ్రతామణియు నగుయశోధర సారె
సారెకుఁ బ్రాణనాథు గుఱించి విలపించియుఁ దూరాగతు లగుసార్థవాహుల నడి
గియు నచ్చటచ్చటికి వార్తలు పంపించియుఁ దరువాత నించుకేనియుఁ దదు
దంతంబు గానరామి నిట్లు చింతించు. 4.

ఉ. ఇంటికి నెంత దవ్వయితొ యేగతి మార్పును జెందినాఁడవో
కంటికి నింత బర్వయితె కట్టిఁడిమాలవిధాత కక్కటా
చంటికుమారు నైనఁ గనఁ జాలునదృష్టము నోఁచనైతి వే
వెంటఁ జరించుచుంటివొకొ వేదన నే నెటు లోర్తు నాయకా. 5.

క. బ్రతికియె యుంటివొ లేదే, మృతియేఁ గనినాఁడవో మ ఱేమైతివొ నీ
స్థితి దెలియదాయె నే నే, గతిఁ బ్రాణము నిల్పుదానఁ గతినాత్మిక నై. 6.

క. ఈకపిలవస్తుపురమున్, దేకచ్ఛత్రాధిపత్య • మొనయక సన్యా
సాకులత శోక మందుట, నీ కెటు తగునయ్య ధాత • నిర్దయుఁడవు గదా. 7.

క. మాయయ్యకన్న వెండియు, నాయీసుతుకన్న మఱియు • నాకన్న నృపా
లా యెంతపుణ్యవతియో, మాయమ్మకు ధాత మున్న • మృతిఁ గల్పించెన్. 8.

వ. అని మఱియు దుఃఖావేశంబు సైఁపఁ జాలక. 9

గీ. శాక్యవంశసంభవుఁ డగు • చక్రవర్తి,ననఘు నేమంచు నెంచి సం•న్యాసిఁ జేసి
యడవి నిడుమలుగుడిపించె • నకట ధాత, యుచితమనుచితమును సుంత • యుండవలదె.

క. ఇటులఁ జింతించుచుఁ గడు న,క్కటికం బొలయంగఁ గల్ప • కల్పము గాఁగన్
ద్రుటిఁ గడపుచు నొకనాఁ డె,క్కటిఁ జనెఁ బూఁదోఁటకు మధు • కాలమునందున్.

మ. అలరుల్వారెకు నించుపూఁబొదలయం • దందంద విశ్రాంతి కై
మలయుందానును భర్తయు న్మనుపు సం•న్యాసించువృత్తాళికిం
దలఁకు న్లో నులుకుం డిటంబు గను వం•తం గాంచు శంకించు లోఁ
బలవించుం జెలికాని చెయ్యూలకు నం•ప్పద్మాక్షి విభ్రాంతయై. 12.

మ. పదముల్ త్రొక్కిల నెమ్మనం బవియ బా•ష్పప్రావృతంబై వసం
తదశం జూడఁగలేక కన్మొఁగవ వం•తం గూర్చ నెమ్మే న్నవోడం
కఁ దదాయత్తమనస్క యై యొకట న•క్కాంతాలలామంబు గ
ద్గదకంఠంబున నొక్కకాలువదరిం•గాలూఁది యాలోల యై. 13.

క. మొగమునఁ బడు జడలం దగ,నెగఁద్రోయుచుఁ గాంతి దక్కి • యెంతయుఁ గృశ యై
పొగిలెడి చెక్కుం దాదృశ, మగు కేలం గీలుకొల్పి • యవనతముఖి యై. 14.

సీ. ఉత్సవం బనుచు శా•క్యుల కెల్లఁ దు చాటింపఁ, బాటించి నన్నేల • పంపెఁ దండ్రి
పంపుఁగా కందఱు • పడఁతులవలెఁగాక, యతనిమానసము న•న్నంటనేల
యంటుఁగా కాత్మవి•ద్యాసక్తుఁ డని యెఱింగియు నమ్మహాత్ము నె•నయుటి దేల
యొనరిన నేమి న•న్నెంతేని గారవమ్మునఁ జూచి తుదకిట్లు • చనఁగనేల

గీ. చనిన వారలు లేరె యీ • సరణి వార్తలైనఁ దెలియంగ నీయని • యట్టివారు
గానరా రారు గాని యేఁ • గడచు టెట్టు, లీవియోగాబ్ధి దుర్భోగ • మెట్లు తప్పు.

చ. అని పలుమాఱు నెమ్మనము • నందుఁ దలంచుచు మిన్ను మన్ను నొ
క్కనియతి గానలందురుచుఁ • గాంతుఁడుఁ ధానను ముమ్మ పేర్మి నె

క్కొనఁగ వసించినట్టి సుమ+కుంజములం గనుఁగొంచు నక్కటా
యనుచుఁ బురాకృతం బనుభ+వైకవినశ్వర మంచు నెంచుచుక్. 16.

వ. పశ్చాత్తాపాతిరేకమ్మున మణిమయమ్మును సిద్ధార్థుండు తనకిచ్చినదియు నగు మే
ఖల కేలం గొని పతి లేచి పోయిననాఁటిరాత్రి నుద్దేశించి. 17.

మ. అకటా కృత్రిమ మింత యే నెఱుఁగ క+న్యాసక్తుఁడుంగాక ని
ర్వ్యాకలం బైనమనంబుతో ననుఁ గడుం+ బ్రేమించి నిద్రించు నా
యకుని న్నాదగుపక్కనుండి యెడసే+యం జాలితో రాత్రి జా
లికి దూరం బగు పేరికేనియును మే+లే చాలు దుశ్శీలినీ. 18.

వ. అంతంబోక కొమరుం డగు రాహులుం గూర్చి 19.

మ. కొడుకా యెంతటిదుర్మహూర్తమున నా+కు న్నీవు గర్భంబునం
బడితో నాఁటి నిశీథమంద జనకుం+ బైరాగిఁ గావించి పె
క్కిడుమ ల్పొందఁగఁ జేయుచుంటి వకటా+యే మందు నీచంద మె
వ్వఁడు తండ్రి న్సుఖపెట్టు వానికిఁ గదా+వర్తించుఁ బుత్రుం డనక్. 20.

చ. అనిపలుమాఱుఁ దల్లి వను+నార్తి యొకించుకయేని బాల్యవ
ర్తనుఁ డగు రాహులుం డెఱుఁగ+రామి సమీపమునం జెలర్చు పూ
లను దగఁ గోసి తెచ్చి మిగు+ల న్వగలం సగులంగఁ జేయఁ గే
ల నిడుచుఁ గేరుచుం దుముకు+లం గొలుపు న్నిశు వే మెఱింగెడుక్. 21.

వ. అట్టియెడ వెండియు నయ్యశోధర శోకావేశంబున నలుగడలర దిలకించి. 22.

చ. అవని సమస్తముం దిరుగు+హంసవతంసములార మేటి జ
క్కవకవలార నాయెఱుకఁ+గాంచి చరించు పికమ్ములార కీ
రవరములార యెం దయిన+రాసుతు జాడ లెఱుంగవచ్చెనే
నవసరముం గ్రహించి నను+నాతనికి న్వచియింపుఁడో వ్వగక్. 23.

మ. సుతుఁ డేడేండ్లవయస్సువాఁ డనియు నిం+జాడ న్వనంబందు ఖ
ల్కుటుకంబారఁగ నున్నవాఁ డనియుఁ గో+ర్కు ల్మిన్ను ముట్టంగ నీ
సతియై నట్టి యశోధరాతరుణియుం+జాలేక ప్రాణావశే
షితయై యాగతి నిల్చియున్న దనియుం+న్శ్రీఘ్రుంబ పంపండగుక్. 24.

వ. అని యిట్లు పరిపరివిధంబులం బలవించుచుఁ గొందలమందు నయ్యశోధరపాలికి
నెచ్చెలు లరుదెంచి యి ట్లనిరి. 25.

గీ. హస్తిపురినుండి యిర్వ్యోడ కరుగుదెంచి, వార లిరువురు వర్తకు లవ్వారిపేర్లు
త్రిపుషభల్లూకు లంట సర్వదేశములు చ,రించు నెడఁ గాంచిరఁట శాక్యనృపతనూజు.

వ. వార లిరువురు మన కోటదక్షిణద్వారంబున విడిసియున్నవార లో దేవీ యంద
మగు సరిగంచు దుప్పట్లును మంచికత్తులును బిత్తలపాత్రములును దంతపువస్తు
వులును సుగంధద్రవ్యములును జిత్రవిచిత్రమ్ము లగు పత్తులును నమ్మఁ దెచ్చి రని
మఱియు ని ట్లనిరి. 27.

ఉ. దీనికి నేమి గాని విను దేవి భవత్పతి యౌనృపాత్మజు
న్మానుగఁ జూచి వీరలు నమస్కృతి సల్పితి మంచుఁ జెప్పి రా
జ్ఞానధనుండు జ్ఞానులకు నైతము జ్ఞానము దెల్పుచుం గృపా
నూనతఁ బూని పూజ్యుఁ డయి యున్నవిధమ్మును జెప్పి రచ్చుగన్. 28.

క. ప్రకటగతి బుద్ధుఁ డను సా, ర్థకనామము పూని యిద్ధరం దా నెంతే
నకలంకబుద్ధి లోకో, పకృతికిఁ జరియించుచున్నవాఁ డఁట తల్లీ. 29.

క. అని వెండియు నా పెకు ని, ట్లని రో వనజాయతాక్షి యతఁ డిచ్చటికిం
జనుదెంచు నెవ్వేళ మ్మని, యును జెప్పిరి యెంతనిక్కమో యది యనుచున్. 30.

మ. పరమానందపరీతరై మనము దాఁ బ్రస్వామి వేగ న్యశో
ధర యావర్తకుల న్సగౌరవవిధుల్ దైవాఱ నాయొద్దకు
న్సరవిం దోడ్కొనిరండు రాకొమరు సచ్చారిత్ర మాలించి పం
దురుకర్ణమ్ములకు న్రసాయన మొనర్తుం జింత లిం కేటికిన్. 31.

క. వారలు కోరుకొనిన బం, గారము రత్నములు గాన్కగా నిచ్చెద మీ
కోరినయవియును వికాసుం, గారవమున నిచ్చి పుత్తుఁగా చెలులారా. 32.

వ. అప్పుడు నెచ్చెలు లేగి యాసార్థవాహుల రావించుటయుఁ దెరచాటున నిల్చి
యుండి యాయశోధరయు. 33.

ఉ. ఓయనఘాత్ములార పరమోపకృతిం బొనరించుచుం జగం
బేయెడ విల్లుగాఁ దిరుగు నీన్నృపనందనుచంద మెల్ల నా
యారయెడఁ గాంచి యీయెడకు నమ్మహనీయుఁడు వచ్చునంచు మీ
రే యిటఁ దెల్పినార లటు యీయది సత్యమకా వచింపుఁడీ. 34.

వ. అప్పుడు వంకఁ ద్రిపుషుండను వాఁ డి ట్లనియె. 35.

శా. తల్లీ యయ్యమలాత్ముఁ జూచితిమి త♦త్పాదద్వయి స్ఫూర్తి సం
ధిల్లన్ మ్రొక్కితి మగ్గురుం డఖిలపృ♦థ్వీనాధమౌళిస్థలో
త్ఫుల్లశ్రీఖచితాంగుఁడై సుఖముగా♦బోధ్యావ్యయమ్ము న్సము
ద్యల్లీలమ్మును నైన మత్త్రికడ బు♦ద్ధత్వంబుఁ జెందెం బగన్. 36.

వ. అవ్వటవృక్షంబు మగధదేశమ్మున ఫల్గునీనదియొడ్డున గయానికటమ్మున నున్నయ
ది యమ్మహానుభావుం డెల్లరకు విజ్ఞానంబు తేటతెల్లంబుగ బోధించుచు ననేక
జనానుగమ్యమానుం డగుచు మహోన్నతానందపదవియం దున్నవాఁ డింతయేల
గాలివెంట జీర్ణపత్రంబులకేనియు గోపాలునివెంట గొఱ్ఱెలమంద కేనియు యుగ
పద్గమనం బలవడకుండుఁ గాని యమ్మహాత్మువెనువెంట నెల్లజనులకుయుగపద్గమనం
బలవడకుండ దని మఱియును, 37.

క. తొలకరివానలకు న్మం, గల నాతం డిటకు వచ్చుఁ♦గలకంఠీ నా
పలుకులు సత్యములిందుం, గలుగ దసత్యంబు నీవు♦గానిలకు మిఁకన్.

చ. అనుడు యశోధరాబ్జముఖి♦యందనిమానిఫలంబు చేతికం
దినగతి సంతసించుచు మ♦ది న్మఱి కోరుకు లెన్నియేని నిం
పున ఘటియింపఁ దన్మయతఁ♦జొంది పొరింబొరి మూర్ఛ చెందె సం
గనలకు నింతకంటె సుఖ♦కాలము వే ఱొకఁ డెందుఁ గల్గునే. 39.

వ. ఇట్లు పరవశలైయె తనంతన తెలిసి వారలఁ గాంచి మేదురం బగునాదరంబున ని
ట్లనియె. 40.

క. అనఘాత్ములార జ్ఞానము, జనియించె నతనికి నని వె♦సం జెప్పితి రే
యనువున నాసంగతి మీ,కు నెఱుంగంబడియె నాకుఁ♦గొంచక చెపుఁడా. 41.

వ. నావుడు ఛల్లాకుం డనువాఁ డి ట్లనియె. 42.

చ. ధరణి వడంకె వాయువులు♦తద్దయు భీతియొసంగ వీచెఁ బె
న్పఁబడలు వచ్చె నన్నియును♦జ్ఞానము నీపతి కబ్బుటోర్వ క
మ్మరుఁ డొనరించుచెయ్వులని♦మాకు వినంబడెఁ దానఁ జేసి మే
మరిగి సమాధినిశ్చలు మ♦హామహుఁ గంటిమి మత్తిచక్కటిన్. 43.

వ. వెండియు నమ్మఱునాఁడు ప్రభాతమ్మునఁ బూర్వమ్ముకంటె శతగుణమ్ముగ తేజ
మ్మునఁ బద్మబంధుం డుదయించె. సమస్తజనులహృదయమ్ములు నమందానందకంద

ళితమ్ము లయ్యె నిది యి ట్లుండ నాకాశవాణి యోబుద్ధా నీతెలిసిన విజ్ఞానంబు జగంబున కుపదేశించి యందఱిం గృతార్థులఁ జేయు మని పల్కెడు బుద్ధుండు నమ్మాటకుఁ జెలునగ వంకురింపఁ దత్రత్యుల కి ట్లనియె. 44.

చ. వినుఁ డొకమాట దెల్పెద నవీనులకుం బరిపాకశూన్యులై
తనరెడివారి కెక్కఁ రణిఁదత్త్వము తేటపడుం దినేంద్రుఁ గ
న్గొనియును బూలచందమునఁ గుట్మలము ల్వికసించునే పురా
తనపరిపాకవంతు లగు తాత్త్వికులం గరఁగింతుఁ గావునన్. 45.

వ. అని కొండొక యుపన్యసించి యచ్చోటు గదలి వారణాసికిం బోయి యయ్యె డఁ గౌండిన్యభద్రకాశ్వజిద్బసవమహానామ లను నేగురకు శిష్యులకు జననమర ణమ్ములు నశింపఁజేయు నుపాయమ్మును సర్వమ్మునకుఁ బురాకృతం బగుసుకృత దుష్కృతరూప ధర్మంబు గాని వే ఱొండు దైవమ్ము లే దనియు నరకం బన వారు వా రొనర్చికొనెడి బాధయే యనియు రాగద్వేషాదు లడఁప నేర్చినవారికి నిర్వాణంబు కరతలామలకం బనియు నహింసయు భూతదయయుఁ గలవారలా నిర్వాణపదవి కధికారులనియు నుపదేశించె, నందుఁ గౌండిన్యుండు చక్కఁగ సం గ్రహించి ప్రజల కందఱికిఁ దాను నుపదేశం బొనర్ప నెంచి దేశసంచారమ్ము నకు వెడలెఁ దక్కుంగల నలువురును గొంతకాలంబునకుఁ గౌండిన్యునియట్ల విజ్ఞా నులై లోకోపకృతికై పాటుపడుచు దేశమ్ములు చరియింప నేగిరి. 46.

క. పదపడి యశోదనృపుఁ డేఁ, బదినల్వురుభృత్యులు దను బలిసికొలువ న
భ్యుదయార్థి యగుచు నేతదు, పదేశమును బడసి తత్త్వపారగుఁ డయ్యెన్. 47.

వ. శుద్ధసికతాప్రదేశంబునందు జలప్రవాహంబునంజేసి తృణోదయం బగుపగిది బుద్ధు ని యుపదేశంబున నారాజభృత్యులకును మనంబుల జ్ఞానాంకురమ్ములు వొడమి ముక్తికారణమ్ము చేకూఱె ననుసంతసమ్ము బలిసె నిట్లు జితేంద్రియు లైన యా యఱువదిమంది శిష్యులును నానాదేశంబుల కేగి బౌద్ధమతం బిప్పటికి నుపదేశం బొనర్చుచుండి రేము నమ్మహానుభావు వెంటఁ గొంతదూరము చని పూర్వజన్మసం స్కారంబు లేమిఁ దదుపదేశంబు మనంబున కెక్కక యథాపూర్వం బగుసార్థ వాహవృత్తిం జరించుచు నిట కరుదెంచితిమి. 48.

సీ. బుద్ధుఁడును బింబిసారుఁ డన్నృడమి కేని, నరసి బోధింప రాజగృహాభిధాన
నగరమున కేగి యతనికిజ్ఞాన మొసఁగె, నచటివా రెల్ల జ్ఞానులై రతనికతన. 49.

వ. పిదప బింబిసారుండు గురువరుం డగుబుద్ధున కధికం బగుసపర్య యొనర్చి 50.

క. గురుదక్షిణగా ధరణీ, ధరకందరసవిధచలదుదారసుధార
మ్యారసప్రవర్ధితనగో, త్తర మగు వేణువన మొకటిఁ దానము చేసెన్. 51.

వ. మఱియు నద్వనంబున విశాలం బగు శిలాఫలకం బొండు స్థాపించి యం దిట్లు
వ్రాయించె. 52.

క. జన్మములకుఁ గారణమును, జన్మమ్ములవలనఁ గల్గుసంసృతిదుఃఖం
బున్మూలించు విధంబును, సన్మతి బుద్ధుండు తెల్పె సదయుఁడు నాకున్. 53.

వ. వెండియుఁ బూర్వోక్తం బగువనంబున నొక్కనాఁడు గొప్పకూటంబు గావించి
యందు బుద్ధుండతిధారాళం బగు వాక్ప్రపంచం బనేకులచిత్తంబుల కెక్కునట్లు
రసవంతంబుగ నొకయుపన్యాసంబు చేసె. 54.

గీ. ఆయుపన్యాసమును విని యంపలిజను, లందుఁ దొంబదివందల మంది బుద్ధు
నివలె సన్న్యాసు లై నీతి నెగడఁజేయ, నేగిరి జగమ్ముఁ గ్రుమ్మర నితనియాన.

వ. పూర్వోక్తం బగునుపన్యాసంబు ముగించుచు నందు సారభూతమ్ము లగువాక్య
మ్ములు కొన్ని వచించె నయ్యవి వివరింతు. 56.

గీ. ఒగి నసత్కర్మములను జేయునరు లెన్నఁటికి విముక్తిని గనరు యోగ్యకృత్యములాచ
రించువారలు వైభవ కాంచుదురు వి, ముక్తి నీయది ఫలితార్థముగ నెఱుఁగుఁడి.

వ. కావున నెల్లవారును సన్మార్గావలంబకులును జితేంద్రియులు నై యుండవలయు
నియ్యదియె మోక్షంబునకు ముఖ్యమార్గం బని విరమించె నట యని చెప్పిన
యశోధరయుఁ బరమానందభరితయై వారలకుం దగుబహుమతు లొసంగి యమ్మ
హానుభావుం డిపు డెచ్చట నున్నవాఁడొ యెఱుంగుదురె నావుడు వార లి
ట్లనిరి. 58.

గీ. రాజగృహ మను నప్పురరాజమందు, బుద్ధుఁ డున్నాఁ డిచటికి నప్పురమునకును
యోజనములొక్కయఱువది యుండుమధ్య, శోణనదము మొదలును జూడనగును.

వ. అనవుడు నప్పతివ్రతామణియును వాయువేగంబునం బోవుగుఱ్ఱపురౌతులఁ గొంద
ఱం బిలిపించి వారలచేతికి ట్లాకకమ్మ వ్రాసి యిచ్చి పంపించె. 60.

సీ. కుముదిని శశిరాకఁ గోరెడిక్రియ నశోకలతయుఁ బ్రోదయఁ గలికి కాలి
తాఁకు వాంఛించువిధమ్మున నీరాక, చింతించు చాతకి సంతసం బొ

లయ నిట శోకసారి • దయచేసి భవదవ్యలంబింతం బైనమ • తంబు నాకు
నుపదేశ మొనరించి • కృప చూపఁదగు మహాత్ముల కనదలఁ బ్రోవఁ • దలఁచుకంటెఁ

గీ. గలదె సుకృతంబు వైశమ • కదలి దర్శనం బొసంగి కుమారుని • నన్ను జనకు
ననదృశానందవార్ధి నో • లార్చిమరల నేగుసవసర మేనియుఁ • నేగు మనఘ. 61.

వ. అట్లుత్తరమ్ము గ్రహించి వార లతిత్వరితగమనంబున రాజగృహపురంబునకుం
బోయిరి. శుద్ధోదనుండు నింతకుమున్న పూర్వోక్తు లగువర్తకులవలన నీవార్త నె
ఱింగి తానుం గొందఱి నంపుచు వారితో ని ట్లనియె. 62.

మ. ఒకయేడేండ్లరిగె న్నినున్విడిచి తా • నొక్కండునుం దేశయా
త్రకునై యేగి శరీర మింతదనుకం • బ్రాణావశేషంబుగా
నొకభంగిం ధరియించి యుంటి నిఁక నే • నోపం ధరింపంగఁ దం
డ్రికి శోకం బొదవించుపుత్రకునికం • టెం దుష్టు లెవ్వారిలన్. 63.

వ. అనియతనికి బోధించి యె ట్లయిన నన్నుం జూచునట్లు సంధింపుఁడు. మఱియుం
బురిలోఁ గలవార లాబాలగోపాలంబుఁ దనరాక కెదురు చూచుచున్నా రని
వచింపుఁడు పొండు నావుడు వారును శీఘ్రగమనంబున నరిగిరి. 64.

క. ఈరౌతులు నారౌతులు, నారాజకుమారునొద్ద • కరిగెడివఱ కా
ధీరుఁడు బుద్ధుఁడు శిష్యుల, కారసి బోధించుచుండె • నమృతమయముగన్. 65.

వ రౌతులును దదీయ మృదుబోధామృతప్రవాహమ్మున కలరుచుఁ గర్తవ్యంబు మఱచి
యిది వృష్టిసమయం బిది రాత్రిసమయం బని యెఱుంగక ప్రసూనగతమరందాభి
లాషమ్మునఁ జిక్కిన తేనెటీఁగలచందంబునఁ దదేకాయత్తచిత్తంబునం బొదలుచుఁ
దదంతేవాసి గణంబునం గలసిరి. 66.

గీ. పిదప శుద్ధోదనుఁడు పుత్రు • విధము నరయ, నరిగి రౌతులు రాకుంట • కాత్మ నెంచి
తనకువిశ్వాస్యుఁడునుగుమా • రునకుబాల్యహితుఁడునగునుదయను బిల్చి • యిట్లువల్కె

క. మును వంపిన రౌతులు పుత్రునివార్తం దేక యెటకుఁ • దొలఁగి చనిరొ నా
కనఘా తెలియఁగరాదు, య్యెను నీ వరిగి యెటులైన • నిది తేరఁదగున్. 68.

వ. అనవుడు నుదయనుండు వైళంబ రాజగృహంబున కరిగి యట బుద్ధుం గని తత్కా
లంబున నతండు శిష్యులం గుఱిచి యుపన్యసించువిధంబు కొండొక విని తనచిత్తం
బును ధన్యముగా బగుట కచ్చెరు వంది తత్సమీపమ్మున నస్ను(?)శయించి యున్న వార్తా

హాయలం గాంచి తానును నతని హాగమ్ము తంబు గ్రోలిన నట్లు యగుదు నేమో యను భయంబునం గర్ణపుటంబున మహాచ్ఛిష్టంబు గూడుకొని యతనిసమీపంబునకుం బోయి శుద్ధోదనుండును యశోధరయుం బక్కనపల్కులన్నియుం బచించిన నతండు కరంబులు ముకుళించి సభ్యులు విన నిట్లనియె. 69.

క. జనకుండును నర్ధాంగియు, ననుఁ గనుఁగొనుతలఁపు మిగిలి నాయనుఁగుమి
త్రుని బంపిరి కావున నేఁ, జను టుచితము తడ వొనర్ప జనదిఁక మీఁదన్.

గీ. ముక్తికారణ మనుదేహమునకు హేతు, భూతు లగుతల్లిదండ్రులు చేతములకుఁ
బ్రీతిసల్పుట పెద్దయు నీతిపథము, నాకకా దీయది సమస్తలోకులకును. 71.

గీ. ధర్మగతిని జరించుచుఁ గర్మఫలము, ననుభవించుచు భూతమ్ములను సమస్త
విధములను దుష్టిచేయు వివేకధనుల, కబ్బు నిర్వాణపదము నిస్సంశయముగ. 72.

వ. అని యుదయునకెక్కుడుఁ గంబై యేనతిత్వరితగమనంబున వచ్చుచున్నాఁడని యా మ్మన నతండును గపిలవస్తుపురంబునకు వచ్చి కడచినవృత్తాంత మెల్ల విన్నవించుటయుఁ బౌరు లెల్లరు సంతోషపదంకురితాంతరంగు లై తమతమ గృహద్వారంబు లలంకరింపఁజేసిరి. శుద్ధోదనుండును గోటకు దక్షిణద్వారంబున నొక్కవితానంబు గట్టించి రంభాస్తంభంబులు నారికేళపత్రంబులు నాటించి నానావిధచిత్రపటమ్ములు సంఘటించి గాయకవందిమాగధగణికాబృందంబు లందంద నుచితముగ మెచ్చు లొనర్పనియమించి పరమానందంబునఁ గొమరురాక కెదురు చూచుచుండె నట్టియెడ యశోధరయు నొకపాలకి నెక్కి యాకాయమానమ్ము దాదాపున ధవునిరాక నిరీక్షించుచుండెఁ బౌరులును నతఁ డెప్పుడు వచ్చునో యనుతమకంబున నెదురు చూచుచు. 73.

క. కొందఱు గోపురములు మఱి, కొందఱు మాడువులుమఱియుఁ గొంద ఱరంగుల్
నందడి నెక్కిరి కన నా, నందసముద్రాంతరమ్ము నందడఁబడుచున్. 74.

క. వచ్చెడిపాంథుల నందఱి, నచ్చుపుభక్తిమెయి బుద్ధుఁడగ పడఁడు గదా
యెచ్చట నేనియు దారి, న్వచ్చెడిచో ననుచుఁ జేర్చి వడ్డితిఁ బౌఱన్. 75.

క. అడుగుచును గొంతదనుక, న్నడచి కనుంగొనుచు వచ్చునా యని లోలో
నుడుకుచుఁ బలవించుచు న, ప్పుడతి యశోధరయునట్ల పొల్పడి యుండెన్ 76.

వ. ఇట్లు కపిలవస్తుపురం బంతయు నాబాలగోపాలంబుగ నిందూదయంబునకు మున్ను గల్లోలితం బగుపాల్కడలితెఱంగున నల్లకల్లోలంబై యుండె నచట

సర్వార్థసిద్ధుండును రాజగృహంబు వదలి యిరువు రంతేవాసులు దక్కఁ దక్కిన వారిం దనతోడ రావల దని నివారించి కపిలవస్తుపురాభిముఖుం డై చనియె నంత.

చ. అనలు డొకండు హస్తమునయం దొకమృణ్మయపాత్రఁ బూని బి
చ్చమునకు నిల్లిలం జనుచుఁజక్కఁగఁ బెట్టినవారిఁబోలె బి
చ్చ మిడనివారి నేని నయసంగతిఁజూచి నమస్కరించుచున్
గ్రమముగ రాఁ గనుంగొనియెఁగాంత యశోధర యాదరంబునన్. 78.

వ. మఱియు నిరువు రాతనింబోలెఁ గాషాయాంబరధారులై వెంబడి వచ్చుచుండిరి గాని మృణ్మయపాత్ర ధరించి బిచ్చమెత్తుకొను సన్న్యాసి ముఖస్తోత్రంబు మహానుభావత్వసూచకంబుగాఁ గన్పట్టటంజేసి యాతనిదర్శన మాచరించినతోడఁ బ్రతి మనుజునకు నితనికి శుశ్రూష చేయవలయు నను నిచ్ఛ వొడముచుండె. 79.

ఉ. ఆతని గాంచినంతన భయమ్మును భక్తియు నెప్పఁ బాదకం
జాతము సోఁక మ్రొక్కి పరిచర్య యొనర్చు మనంబుతోడ న
య్యాతగువస్తు వీతనికి నెక్కటి యిచ్చినను గ్రహింపఁ డి
ట్లీత నివెంట నేనిఁ జరియించినఁ బుణ్యము గల్గు నం చొగిన్. 80.

వ. స్త్రీలును బురుషులును నొకరివెంట నొక్క రిమ్మహాత్ముఁ డెవ్వ రొక్కొ యని లోలోఁ బ్రశంసించుకొనుచు నరుగుచుండిరి గాని యితఁడ సర్వార్థసిద్ధుం డని యొకఁడును గుర్తింపలేఁ డయ్యె న ట్లమ్మహానుభావుండును రాజమార్గంబునం బోవుచు రాజద్వారంబు సమీపించునెడ యశోధరయు. 81.

సీ. సహకారకిసలయచ్ఛవితోడఁ దలనిండ, జడలుగట్టిన శిరోజములతోడ
రోహిణీసహితార్కరుచిత ప్తసుమలతా, గ్రంబుఁ బోలినశరీరంబుతోడ
దినకరచ్ఛన్నుఁ డై తేజఁ బాసినపూర్ణ,చంద్రుఁబోలిన ముఖచ్ఛాయతోడఁ
జిరదృష్టపతిరూపపరిపుష్టవైవర్ణ్య, దైన్యసంతోషఖేదములతోడఁ

గీ. గూడ నేఁడేండ్లరోహిలుం జేడ కేగె, దంచుఁ జెలరేఁగుచును జీరయంచు లాగ
నెడఁద నేవేళ భావింపఁబడుచున్న, జీవితేశ్వరు గుర్తించి చేరఁబోయి. 82.

క. హా సిద్ధార్థా యని కడు, నాసమెయిం గనుల నశ్రులత్యధికతర
ప్రశివృష్టి సేయఁ బదములఁ, కై సేసెన్ మిగుల నెగడు కచభరకాంతిన్. 83.

సీ. ఆతఁడు లేవనెత్తనంత కమ్మహిళ వి, వశమనస్కయగుచు వగ నిగుడఁగఁ
గౌఁగిలింపుకొనియెఁ గాంతలు కాంతుల, గారవించు టిట్లు కాద యెందు. 84.

వ. పదంపడి సిద్ధార్థుండును మొదట నొక్కయంతేవాసినిగాఁ దలంచి తత్ప్రాత్యం
బునను దదీయముఖసౌష్ఠవంబునను బ్రియురాలిఁగా గుర్తించి యోదార్చి జ్ఞానదా
యకంబు లగు వచనంబులు కొన్ని వలికి యాపెమనంబు కలఁక దేర్చునప్పటికి
గుంపుగూడి వెంటవెంట వచ్చుచున్న పురజను లందఱకు నితండ సర్వార్థసిద్ధుం
డనుచిహ్నంబులు వొడసూపె నంతట మృదుమధురగంభీరసంభాషణమ్ముల విష
యనివర్తనవిషయంబు లగునుడువులు నుడువుచున్న కుమారు నవికారు మారాకా
రు దవుదవ్వులం గాంచి యాతనివేసంబు మనంబు గలంప శుద్ధోదనక్ష్మాపాలుండు
కోపంబు పట్టఁజాలక పారుషం బట జిగి డగ్గఱకుం జనుదెంచు నయ్యెడన్. ౮౭.

క. అనఘాత్ముం డగుబుద్ధుండును దండ్రికిఁ జేరి మ్రొక్కుడుం గోపము గ్ర
స్సన మాయమయ్యె బుద్ధుని గనుఁగొనియుం గోప ముండఁగలదే యచటన్.

గీ. అఖిలరాజాధిరాజపూజ్యప్రభావ మహిత మైయొప్పు తనదు కుమారుమహిమ
మరసి యాశ్చర్యమందియ య్యనఘుఁడిట్టు లనియెఁ బుత్రునితోఁ జేర్చి యనువుపడఁగ

చ. ధరసకలంబు నేలుచు సుధారుఁడ వై యశముం గడించి యె
ల్లరు నృపతల్లజుల్ ప్రణతులం బచరింపఁగఁ జొట్టెల్ల వ
ర్వారె యనఁగా సుఖింపఁ దగు నంతటివానికి నింతవచ్చె నె
వ్వరి నెటు సేయ నేరవు కృపారహితమ్ములు ధాతచేష్టముల్. 88.

సీ. ఆపన్నసత్వయా నర్ధాంగి కోర్కుల నింపుమైఁ దీర్చి మన్నింపవైతి
పురుషు వోవకమున్న పుత్రు నెమ్మోము వీక్షించుభాగ్యంబు గాంక్షింపవైతి
నాకుమారుఁ గని సమ్మనమ్మునఁ దలఁచు ప్రజలసమ్మతిని బొందఁజాలవైతి
ముదుసలినై రాజ్యము నొనర్పలేని నా పగునశక్తతకు లోఁబొగులవైతి

గీ. వకట యింతటి రాజ్యంబు నడవిపాలు చేసి సన్న్యాసివైతి కాశ్మీరగర్ద
భమువిధమ్మున నీజాతకము వృథాగ శేషభాజన మింకేమి సేయఁగలదు. 89.

క. నావుడు బుద్ధుం డిది నా కీవేళ నె పట్టువడియె నె పరంపరగా
నే వచ్చుచున్న దనుటయు భూవరుఁ డిట్టు లను నలుక వొంపిరి పోవన్. 90.

క. ఏఁమి మహాసమ్మతముఖ్యులు సూర్యుఁడు నృపులు శాక్యకులసంభవు లీ
యిల నేలి రఁడు నీవలెఁ గలరె వైరాగులం దొకండేని సుతా. 91.

చ. అనవుడు బుద్ధుఁ డిట్లను మహాత్మ మదుక్తి మదీయజన్మవ
ర్తనపర మేను మున్ను బహుపరగా నిటు సన్న్యసించుచుం

జనకుని కుంద దీర్చితిని జ్ఞానధనం బిడి పెక్కుసార్లు కా
వున నిప్పు డట్టిదే ధనము పూర్తిగ నీ కిడువాఁడ శాంతికై. 92.

వ. నే నీజన్మంబున విజ్ఞానలబ్ధివడసి పునరావృత్తిరహిత శాశ్వతనిర్వాణపదవీసమా
రూఢుండ నై యజ్ఞానులకు విజ్ఞానం బొసంగ జన్మించితిఁ గాని శాక్యరాజ్యం
జేయుటకుఁ గా దనుచుఁ బల్కుచుఁ దండ్రికరంబు పట్టికొని జనసంకులమ్ము లగు
వీథులవెంటఁ దిరుగుచు జ్ఞానప్రదమ్ము లగువచనమ్ములు బోధించుచుండ యశోధర
యు రాహులసమేతయై సమీపవర్తిని యగుచు నాదరమేదురంబుగ వక్తవ్యంబు
మఱచి వినుచుండె నట్టియెడ నంతేవాసు లిరువురియం దొక్కఁ డి ట్లనియె. 93.

చ. అడుగఁగఁ గోంకుచుంటి నొక యర్థము దేవర సన్న్యసించియుం
బడఁతిని బిగ్గఁ గౌఁగిటను బట్టుట దోసము కాదె జ్ఞాను లీ
యెడఁ గడు సంశయింపరె సతీచ్ఛ యతీంద్రుల కొప్పునే కటా
వెడఁగుఁదనం బి దెట్టు లాదవె స్వచియింపుఁ డ టన్న ని ట్లనున్. 94.

ఉ. కోరినమాట మంచిదియె కోరఁగవచ్చును గోరినంత నే
నేరము గల్గునే వినుము నీదగుమాటకు నుత్తరంబు ని
ష్కారణ మేరినేనియును గానిఁ జేయుట పాడిగాదు చే
కూరునె యింతమాత్రమున కున్నియతాత్ములకుం గళంకముల్. 95.

వ. అదియునుంగాక తదాలింగనంబు తత్కృతకంబు గాని యస్మదారబ్ధంబు గా
దిఁక నొక్కవిశేషంబు వచించెద వినుము. 96.

ఉ. తాను విముక్తిఁ జెందినవిధమ్మున నొర్లను దేర్ప నెంచు న
వ్వానికి నేరికేనిఁ బరిభావము సూపుట మంచిగాదు స
న్మానము చూపి హీనిని గ్రమమ్మున బోధసుధారసప్రసా
దానుభవజ్ఞతావిధురితాత్ముఁ జేయఁదగున్ స్వశక్తిచేన్. 97.

వ. ఏను గృహంబు విసర్జించి పోవునాఁ డీమెకు నా నేర్చిన విజ్ఞానంబునం బాలా
సంగుదు నని వాగ్దానంబు చేసినవాఁడ నీమెయు సంసారవాంఛఁ ద్రుంపలేక
పూర్వసర్వార్థసిద్ధుండ నని యనురాగమ్మునం జేసినపనికి నివారించితి నేని యంతే
హానిని యగుట తటస్థింపదు. 98.

సీ. ఎన్నియో జన్మములకు మున్నేను సింహళ మ్మనెడి ద్వీపమున జనన మ్మొంది
రాముఁ డను పేరనుంటి నీరమణి యపుడు లక్ష్మి యను పేరనాకుఁ గళత్రమయ్యె.

వ. అయ్యెడ మే మిరువురమును బీదలమై యుండుకతన నెటకేనియుం జని ధనమా ర్జింతు నని యోజించి దేశంబు గ్రుమ్మ దలంచిన నమ్మగువ యిట్లనె. 100.

మ. సదయా నన్నిట డించిపోవుటకు నిచ్చం జేయఁగాఁబోకు నా
పదె యెల్లప్పుడు నీయధీన మిది సంభావింపు మత్యంతక
ష్టదశాపాదక మైన నీదుపరదేశవ్యాప్తి కే మంచు నా
ప్పెద దాంపత్యవియోగ మేరి కయినం బ్రీతిం బోసంగించునే. 101.

క. అని యంగీకృతి చూపని, వనితను విడనాడి కదలి పై నాకామా
గ్గనియతిఁ జనిచని పదపడి, యనేకకష్టములు గాంచి యట నొక్కయెడన్.

క. విలువయుఁ జెలంగము దళుకును, గలయొక ముత్తియము దొరకగా నది కొని యే
నెలమిం దేశంబునకు మ్మరలి చనుదెంచితిని మిగుల రయముల రారన్. 103.

వ. అప్పటికేని మదీయదేశం బత్యంతక్షామపీడితం బై యుండినకతన నన్నంబు లేమిఁ గడుఁగృశించి యుద్విగ్నచిత్త యై మూర్ఛవోయి యున్న జాయం గాంచి యేనును దుఃఖాక్రాంతుండ నై యివ్వడంతి నెవ్వ రన్నం బిడి బ్రదికెంతురో వారల కీముత్యం బిడువాఁడ ననుచుండట నొకండు తనయొద్దనున్న సత్తు వోసంగి యాముత్తెముం గొనియె లక్ష్మియు నాపేలపిండి తిని లబ్ధసంజ్ఞయై నన్ను విశ్వాస్యునిఁగ శ్లాఘించె నాజన్మము మొదలు ప్రతిజన్మంబునను మేము దంపతులమై జనించుచుంటిమి కావున నీ మెం గూడ నిర్వాణపదారోహణం జేయుటకు నుపాయంబుగాఁ దదాలింగనంబు నివారింపనైతి నని మతియు ని ట్లనియె 104.

క. జ్ఞానం బొరుల కొసంగినఁ, దా నెగడుం దీపమువలె ద్రవ్యంబిడ న
న్నానికి లేకుంటయుఁ జెఱ, దానికిఁ గలుగుటయుఁ బొడమువ్వ యు మగుకతనన్.

క. వెనుకన్ లక్ష్మికి నాచేఁ, సినదానముకంటె నిపుడు చేయువితరణం
బనఘ శతాంశాధిక మగు, ననుపమ మనరాదె జ్ఞానమన్నిటికంటెన్. 106.

క. తా నింద్రియనిగ్రహముం, బూని యబలలకు నితాంతమును విజ్ఞానం
బానఁగఁ జేయుట పురుషుల, కీనెంచుటకన్న మిగుల హెచ్చనవచ్చున్. 107.

వ. కావున నియ్యశోధరకు మోక్షసాధనం బగువిజ్ఞానం బుపదేశింపు మని భార్యం గాంచి తండ్రి కెక్కుమొగం బై యి ట్లనియె. 108.

సీ. వినుఁ డొక్కసంగతి ఘనుఁ డొండె నీచాత్ముఁ డొండె నుద్దండ పండితుండు నొండె నెవ్వండేనియును నాలుగింతరమ్ములు దాఁటి యష్టవిధుల కనుగుణ

ముగను జరించుచు మొదల నెనిమిది ధర్మముల నెఱిఁగి తత్త్వమార్గమందు
దశబలంబులు గల్గి తనర నెప్పటికేని, జన్మరాహిత్యంబు సంభవించు
గీ. ననుచు బోధించుసిద్ధార్థమహస్తమండ, సంగుమృత్పాత్ర యాత్మహస్తమునఁ దాల్చి
కోప మెడఁజేసి శాంతమ్ము కుదురుపఱచి, తాల్చెశుద్ధోదనుఁడు దన తనయుమతము.
క. అంత యశోధరయును స్వత్యంతానందమున మోము దైవాఱఁగ స
న్క్రాంతునిమతమ్ము నమల స్వాంత యగుచుఁదాల్చి మిగుల శాంతి వహించెన్.

## ఆశ్వాసాంతపద్యములు.

క. శ్రీమంత పాల్యమానసు, ధీమంత పరోపకారధీమంత మహా
సామంత సరసతరవా, ణీమంతా చారుతావనీతవసంతా. 111.
శా. శ్రీరామాకరుణాకరస్వగుణరాశీ దూరదూరీకృత
క్రూరాచారకథానకా కృతినుతా కొచ్చర్లకోటాన్వయ
క్షీరాంభోధినిశాకళత్ర గుణలక్ష్మీభూతదీవ్యద్దయా
పారావార యుదార కృష్ణధరణీపాలాగ్రణీ ధీమణీ. 112.

## పంచచామరము.

ప్రమోదబంధురా సుధీవిపశ్చిదాదృతాదరా
ప్రమాదదూర ధీర శ్రీకరా యజాతశాత్రవా
పుమగ్రణీ మహాకవీంద్రపోషకా లలత్తురం
గమాధిరోహణప్రసక్తిగణ్యగుణ్యసంస్తుతా. 113.

## గద్యము.

ఇది ...శ్రీతిరుపతివేంకటేశ్వరప్రణీతం బైనబుద్ధచరిత్రం బనుమహా
ప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.



శ్రీరస్తు.

# బుద్ధచరిత్రము.

తిరుపతివేంకటీయము.

## షష్ఠాశ్వాసము.

క. యాచకచయసుబుధద్రుమ, మోచాఫలవిపులమదవిమోచనచణవా
చాచతుర తులితసుమనా,రాచా శ్రీకృష్ణరాయ రసవద్గేయా. 1.

వ. అవధరింపు మనంతరంబ పతీపితృసమేతంబుగ సన్న్యాసి యగు సర్వార్థసిద్ధుండు తనపురంబునందలి విజ్ఞానాధికారంబు గలమనుజుల కందఱికి భిక్షువేషం బాపాదించి తక్కినపౌరుల కధిపతిగా రాహులునకు శాక్యరాజ్యపట్టాభిషేకం బొనర్చి యచ్చోటుఁ గదలి యనేకాంతేవాసిజనపరివృతుం డై. 2.

చ. తనుగతి శీతమారుతపదం బయి పాఱెడు రోహనాభిధా
నకు సమీపమందు సుమపాదపభూషిత మై మనోజ్ఞ మై
మృగముఖజంతుసంతతిసమేధిత మై ఫలభారవిస్ఫుర
న్నగయుత మై యొలర్చెడి వనమ్మున కేగె మనమ్ము పొంగఁగన్. 3.

వ. సాగరమ్మను పురమ్మునకు సమీపమ్మునం దనరు నవ్వనమ్మున హిమవత్పాదనికట శిలాకుట్టిమంబున నొకనాఁటిసంధ్యాకాలంబున నానందదేవదత్తప్రభృతు లగు శాక్యప్రభువులు వెనుకను యశోధర పాదనికటంబునను శుద్ధోదనుండు వామపార్శ్వంబునను జెలంగ ధర్మాసనం బుండి తనమతంబు సకలదేశాగతాంతేవాసిజనంబులకుఁ జక్కఁగ బోధింప నారంభించె. 4.

చ. అమృతరసంబు వెల్లివిరియంగ మహాత్ముఁడు బుద్ధుఁ డెల్లలో
కములకు జ్ఞానబోధ మొనరింపఁ జేయుచునుండ సూర్యుఁ డ
స్తమితుఁడు గాక భూధరనితంబసమీపతలంబులంద ని
క్షణము వసించుచు న్వినియెఁ గాని తలంపఁడు కాలదైర్ఘ్యమున్. 5.

క. పితృదేవతలును దేవత, లతిముదమునఁ నాకనంబు♦నంద నిలిచి య
మృతిమంతమునుపన్యాసం, బిత రేచ్ఛాకూన్యబుద్ధి♦ నెనసి విని రొగిన్. 6.

గీ. ఆతఁడొనరించునయ్యుప♦న్యాసము వినఁ, గనొయనంగఁదమంబుచ♦క్కటికి రాఁగ
దాను నయ్యది వినుచుఁ బోఁ♦దలఁపని గతి, నంజకెంజాయ కొంత మ♦సలఁదొడంగె.

గీ. తారకావళి హారవి♦ధమునఁ దనర, నిందు జాబిల్లి తిలకమై♦నొసఁడ నీర
దములు తల దువ్వ చెలులవి♦ధమున మెఱయ, సంజయను ప్రౌఢకన్నియ♦చదల నిలిచె.

క. తనభర్తయైనసూర్యుఁడు, చనుచుండం గొంతదవ్వు♦సారెకుఁ గని సం
జ నిగిడ్చెడు నిట్టూరుపు, లనఁగ మలయమారుతమ్ము♦లలముఁ దొడంగెన్.

ఉ. జ్ఞానము నెల్లవారలకొ♦సంగెడిబుద్ధిని బుద్ధుఁ డాత్మభా
షానుగతి న్వచించు వచ♦నావళి యాదట నాలకించునా
నానరజాతికిం దగ వి♦నంబడుచుండె స్వకీయదేశభా
షానియతి న్మహాత్ముల క♦సాధ్యములుం గలుగంగ నేర్చునే.

వ అయ్యెడ బుద్ధుం డిచ్చినయుపన్యాసం బనేతాదృశం బగుటం జేసి యిదమి
యస్మాదృశులకు వివరింప నలవిగాదైనను దిఙ్మాత్రప్రదర్శన మొనర్చెద మది
యె ట్లన్న నతండు తనచుట్టునుం బలసి కొలుచుచున్న నానాదేశీయు లగుప్ర
జలం గాంచి యోయన్నలార సావధానంబుగ మదీయోక్తు లాలింపుఁ డని యి
ట్లనియె. 11.

క. ఎయ్యది యమేయమై చను, నయ్యది వివరింపఁ దరమె♦యది యడుగక బ
ల్మెయ్యమ్మున నావినిచెడు, తియ్యని పల్కులను మీమ♦దిం బెట్టఁ దగున్. 12.

వ. అట్లు వినిరేని యయ్యమేయపదార్థంబు మీయంత మీకుఁ గోచరం బగు. 13.

క. తెలియని దేనియు మాకుం, దెలియంగాఁ జేయుఁ డనుచుఁ♦దివిరి యడుగువా
రలును న్వారికిఁ దెల్పం, దలకొను వారలును దెలివి♦తక్కువవారల్. 14.

గీ. అజుఁడు సృష్టికిఁ బూర్వమం♦దంధకార, మందుఁ దప మొనరించుచు♦న్నట్లు కొన్ని
గ్రంథములు సెప్పఁగా నియ♦క్కతల నిజము, తెలియఁగా రాదు తెలిసిన♦ఫలము లేదు.

క. పొడముట గిట్టుట సుఖములు, నిడుమలునుం గాలగతియు♦నెడ తెగక సదా
పొడమచునుంట యూ ననునివి, కడఁగాంచెడు దనుక మనకుఁ♦గలుగుచునుండున్.

గీ. వదులు జనియించి పిదపవ♦సనిధిఁగలిసి, బొమ్మరూపమ్ము గాంచి యా♦పయి ధళ్వ
లిని బడి యథాస్థితిని గాంచు♦లీల నెపుడు, జననమరణమ్ములకును వి♦శ్రాంతి లేదు.

క. ఇల మొదలుగ నాయామం, దలములు విశ్రాంతి నెయ్యెడం గాక సదా
చలియించునగిది జన్మ,మ్ములనుం బ్రభవంబు నెపుడుం బొందుచు నుందుక్.

మ. ఉపవాసంబులు ప్రార్థన ల్జపములున్ హోమంబులున్ వ్యర్థముల్
కృపమై నీయవి తా నెవండు గొను మీ రీలంచముం జేసి పా
పపుంబుం గడ త్రొక్క నేర్తురె కడుం బ్రాపించు నిర్వాణ దే
హాపరిశ్రాంతి వృథాపరిశ్రమ మనన్ బ్రారబ్ధము ల్పోవునే. 19.

క. మనజన్మపరంపరయును, ఘనతయు నీచతయుం గర్మం బతికారణ మై
పనుపడుం గావున సత్కర్మనియతిం జరియించుటొప్పు మనుజుల కెల్లన్. 20.

ముసపటిజన్మమందు నృపముఖ్యతం గాంచియు నందుం బాపపుం
క. బను లొనరించెనే నతండు బాల్పడు నేం డొకభృత్యమాత్రుం డై
వెనుకటి జన్మమం దొకట భృత్యత గాంచి యు నందుం బుణ్యపుం
క బను లొనరించెనే నతండు పార్థివుం డై జనియించు నిత్తఱిన్. 21.

కర్మంబునకు జన్మపరంపరకును నానంత్యంబ యేని జన్మం బెల్లరకు ను వ్యసన
కరంబ కానియొండుగా దంట సరిగా దేమనం గర్మం బనివార్యం బయ్యును
దనకంటె బలీయం బగుసంకల్పశక్తికి లోపడు నట్టిసంకల్పంబు సమంజసం
జేని నానాటి కుత్తమజన్మంబులు దొడయ నట్టుత్తమజన్మంబులు కొన్ని గతిం
చుడు దివ్యజ్ఞానంబును దివ్యదృష్టియు నుదయించు దానంజేసి నిర్వాణపదంబు
కరతలామలకం బగు నని వెండియు. 22.

క. ఇదివఱకు దారి దెలియమి, నెద లోకులదుఃఖములకు నెంతేం దాపా
స్పదముగ నొనరించెడి నా, కిది యొదవె నుపాయ మొకండు నేతాదృశ మై.

క. తనచేసినకర్మమ్ములు, తనకుం భోజ్యమ్ము లగుచుం దనరు న్మతి య
న్యుని నీయెడం బ్రేరకుం డని, యనవలవదు తత్త్వవిధము నారయుం డింకన్.

సీ. ఆద్యంతములు లేక యజలోకమునకంటె పై నొప్పునక్షత్ర పటలి దాంటి
వెలుంగుచుండెడు నొక్క విమలాత్మ యగుశక్తి, యది యెల్లవస్తువు లందుం దత్త
దనుగుణగుణముల ననుఘటించుచు నెల్ల, యెడలను వ్యాపించి యెల్లరకును
మంచిమార్గమ్ము నేమఱక సూచించుచు, నచ్చైచ్ఛికస్థితికిం దెచ్చుచుండు నిరియ

గీ. చిన్ని చీమలు మొదలగు చేతనములకును ననుఘటించు సంతానమున ననూన
రాగవిరాగుది య పయోధరములు సార్థకములుగాం జేయునిపులుగలుగు వెడలు.

